శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 10



సారంగపాణి(ఆరావముదాన్) పెరుమాళ్, కుంబకోణం



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పాగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



తిరునరయూర్‌నంబి, తిరునరయూర్(నాచ్చియార్ కోయిల్)



తిరునారాయణ పెరుమాళ్, మేల్కోట

# విషయ సూచిక

# భగవత్ప్రసాదం

మనం ఏ విధమైన ఆహారాన్ని తీసుకొనప్పటికీ, దానిని ముందుగా భగవంతునకు నివేదన చేసి, ఆ భగవంతుని శేషంగా ప్రసాదంగా భావించి, దానిని స్వీకరించాలి. భగవంతుని ప్రసాదం అయినప్పుడు ఆ ఆహారంలో మంచి గుణాలు ఏర్పడతాయి. అటువంటి భగవత్ప్రసాదాన్ని భుజిస్తే, మనకు మంచి గుణాలు, శక్తి కలుగుతాయి. సాత్విక గుణం అభివృద్ధి అవుతుంది. మనోబలం, శరీర పుష్టి కలుగుతాయి. అందువల్లనే పెద్దలు భగవంతునకు నివేదన చేయకుండా ఏ ఆహారాన్ని భుజించరాదనే నియమాన్ని విధించారు. వండిన అన్నంవంటి వస్తువులే కాకుండా, ఫలాలు మొదలైనవానిని కూడా భగవంతునకు అర్పించిన తరువాతనే స్వీకరించాలి. ఆ యా కాలాలలో ఫలించే ఫలాలను, సస్యాలను కూడా ముందుగా భగవంతుని అర్పించిన తరువాతనే మనం వాడుకునే సంప్రదాయాన్ని పూర్వంనుండి మన పెద్దలు ఏర్పాటు చేశారు. దీనికోసం వేదంలో ఆగ్రయణం అనే ఒక వైదిక ప్రక్రియ కూడా విధింపబడింది. ఆశ్వయుజ, కార్తీకమాసాల రూపంలోని శరదృతువులోనే ఈ ఆగ్రయణం అనబడే వైదిక కర్మ నిర్వహింపబడుతుంది. ఆ ఋతువులోనే కొత్తగా పండిన పంట చేతికి వస్తుంది. ఆగ్రయణ కర్మను ఆచరించి, దానిని ఆగ్రయణ దేవతలకు ముందుగా అర్పించాలి. వైదికాగ్నిలో నూతనంగా పండిన ధాన్యంనుండి లభించిన బియ్యాన్ని వండి, ఆ హవిస్సును ఆగ్రయణ దేవతలకు సమర్పించి, ఆ తరువాతనే ఆ పంటను వాడుకునే క్రమం వేదంలో చెప్పబడింది. ఈ ఆగ్రయణ దేవతలలో అంతర్యామిగా భగవానుడైన శ్రీమన్నారాయణుడు వేంచేసి ఉండి, ఆ ప్రసాదాన్ని స్వీకరించి, అందులో తన అనుగ్రహం ద్వారా ఒక విలక్షణమైన గుణం కలిగే చెట్లు చేసి, అనుగ్రహిస్తాడు. భగవంతుని అనుగ్రహం వల్లనే కదా మనకు ఏ పంట అయినా, ఫలం అయినా, ఏ వస్తువు అయినా లభిస్తున్నది. అందువల్ల, సమస్తమైన ఆహారం భగవంతుని అనుగ్రహం వల్లనే లభిస్తున్నది కనుక, ముందుగా ఆ స్వామికి సమర్పించి స్వీకరించడం యుక్తం. ఆ విధంగా ముందుగా భగవంతుని సమర్పించకుండా, మనమే ముందుగా దానిని వాడుకోవడం దొంగతనంలోకి వస్తుంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు కూడా "యజ్ఞశిష్టాశినః

సంతః హ ముచ్యంతే సర్వకిల్బిషైః" – యజ్ఞం అనబడే భగవదారాధనలో భగవంతునకు సమర్పించి, ఆ భగవంతుని శేషఱప్రసాద శేషంగా ఆహారాన్ని స్వీకరించేవారు అన్ని పాపాల నుండి విముక్తులు అవుతారు– అని అన్నాడు. ఈ విధంగా భగవంతుడు ప్రసాదానికి ఒక వైలక్షణ్యం ఉన్నది. దీనిని తెలిపే వైదికమైన వృత్తాంతంతం ఒకటి ఉన్నది.

అదితి దేవతలకు తల్లి. ఆమెకు ఒక పర్యాయం చాలా సంతానం పొందాలని ఆశ కలిగింది. అందుకోసం ఆమె బ్రహ్మోదనం అనే ఒక వైదికక్రియను ఆచరించింది. యాగం చేయడానికి ముందుగా బ్రహ్మోదనం అనే ఒక ప్రసాదాన్ని తయారు చేస్తారు. ఇది అగ్న్యాధానానికి ముందు సిద్ధం చేయబడుతుంది. ఈ ప్రసాదం బ్రహ్మకు నివేదన చేయబడుతుంది కనుక, దీనికి బ్రహ్మోదనం అనే పేరు కలిగింది. అగ్న్యాధానాన్ని చేసే బ్రాహ్మణులకు ఇవ్వబడుతుంది కనుక కూడా దీనికి ఆ పేరు వచ్చింది– అని అంటారు. ఈ విధమైన బ్రహ్మోదనాన్ని బ్రహ్మకు సమర్పించడం చాలా విశేషంగా చెప్పబడింది. బ్రహ్మకు నివేదన చేసి, బ్రాహ్మణులకు ఇచ్చిన తరువాత మిగిలిన ఆ బ్రహ్మోదనాన్ని అదితి భుజించింది. దాని ఫలంగా ఆమెకు చక్కని సంతానం కలిగింది. వారికి ఆదిత్యులని పేరు. అదితి పుత్రులు కనుక వారికి ఆ పేరు వచ్చింది.

అదితికి ఆశ ఇంకా తీరలేదు. ఇంకా సంతానాన్ని పొందాలని ఆమె కోరుకున్నది. అందుకోసం మళ్లీ పూర్వం చేసిన యజ్ఞాన్నే చేయాలని ఆమె అనుకున్నది. మళ్లీ బ్రహ్మోదనం ఆ యజ్ఞంలో సిద్ధం చేయబడింది. కానీ, ఈసారి అదితికి ఒక ఆలోచన వచ్చింది. ఆ బ్రహ్మోదనాన్ని దేవతానివేదన చేయకుండానే తానే భుజిస్తే ఏమి? అని ఆమె అనుకున్నది. దేవతానివేదన చేసిన శేషాన్ని భుజించడం కంటే, తనే ముందుగా ఆ ప్రసాదాన్ని భుజించవచ్చు కదా– అనే ఆలోచన ఆమెకు కలిగింది. ఆ విధంగానే ఆమె ఈసారి దేవతానివేదన చేయకుండానే బ్రహ్మోదనాన్ని భుజించింది. అయితే, ఈసారి ఆమెకు సంతానం కలుగలేదు.

అప్పుడు అదితి తన మనసులో ఆలోచించింది. తనకు ఈసారి సంతానం కలుగుక పోవడానికి కారణం బ్రహ్మోదనాన్ని దేవతానివేదన చేయకుండా ముందుగా తానే భుజించడమే– అని భావించింది. దేవతలకు నివేదన చేసిన తరువాత వారి శేషంగా మిగిలిన భాగాన్ని భుజించడంలో ఏదో ఒక విశేషం ఉన్నది– అని గుర్తించింది అందువల్ల ఆమె ఇంకొకసారి బ్రహ్మోదనాన్ని సిద్ధం చేసి, దానిని ఆదిత్యులనే దేవతలకు అర్పించి, పిమ్మటనే భుజించింది. అప్పుడు ఆదిత్య దేవతలు ఆమెతో ఒక విషయాన్ని చెప్పారు "నీకు ఒక కుమారుడు జన్మించబోతాడు అతడు కూడా మాతో ఉండనీ. ఇంకా నీకు కలిగే మిగిలిన పుత్రులు యాగాదులను నిర్వహిస్తారు". అని వారు అన్నారు. అదితి కూడా అంగీకరించింది.

తరువాత అదితికి ఒక కుమారుడు జన్మించాడు. అతనికి వివస్వాన్ అని పేరు. ఆదిత్య దేవతలు కోరినట్టుగా ఈ వివస్వాన్ ఆదిత్యులతో చేరాడు. అతని పుత్రుడే వైవస్వతమనువు. ఆ వైవస్వతమనువే మానవ జాతికి అందరికీ మూలపురుషుడు. ఈ విధంగా అదితికి బహుసంతానాన్ని పొందాలనే కలిగిన ఆశ నెరవేరింది.

ఈ వృత్తాంతం వల్ల ఏమి వ్యక్తమవుతున్నది? అంటే, దేవతలకు నివేదన చేసిన ప్రసాదాన్ని భుజిస్తే, అందులో ఒక విశేషం ఉన్నదని, దానివల్ల మంచి ఫలం కలుగుతున్నదని తెలుస్తున్నది కదా. దేవతలకు అర్పించకుండా అదితి తానే భుజించినప్పుడు ఆమె కోరిన ప్రయోజనం సిద్ధించలేదు. దేవతా సమర్పణ చేసినప్పుడే ఆమె కోరుకున్న ఫలం సిద్ధించింది. దేవతలకు న నివేదన చేసిన ప్రసాదానికి అంత మహిమ ఉన్నప్పుడు, ఆ దేవతలకు అందరికి అంతర్యామియై ఉండే భగవానుడైన శ్రీమన్నారాయణునకు సాక్షాత్తుగా నివేదన చేసి, మా స్వామి కటాక్షించిన ప్రసాదాన్ని స్వీకరించినప్పుడు ఎంత ఫలం కలుగుతుందో, ఆ ప్రసాదానికి ఎంత మహిమ ఉంటుందో,

ఊహించవచ్చు కదా. అందువల్లనే పెద్దలు భగవంతునకు సమర్పించకుండా ఏ ఆహారాన్ని భుజించకూడదనే నియమాన్ని పెట్టారు.

అయితే, ఇక్కడ సహజంగా మనకు ఒక సందేహం కలుగవచ్చు. భగవంతునకు నివేదన చేసిన ప్రసాదానికి, నివేదన చేయని ప్రసాదానికి మధ్య ఏ విధమైన తేడా కంటికి కనిపించడం లేదే? ఒకే విధంగానే కదా అవి రెండు కనబడుతున్నవి– అనే సందేహం కలుగవచ్చు. కానీ, ఆ విధంగా భావించరాదు. శ్రీపాంచరాత్ర శాస్త్రంలో ఒక విశేషమైన విషయం చెప్పబడింది. భగవంతునకు సమర్పించే వస్తువు ఏదైనా కానివ్వండి, ఆ వస్తువులు చాలా సూక్ష్మమైన అంశం ఒకటి ఉంటుంది. ఆ సూక్ష్మమైన అంశం మన కంటికి కనిపించదు. పూలనే ఉదాహరణగా గ్రహించినట్లయితే, పూలలో ఉండే సూక్ష్మమైన అంశం మన కంటికి ఏమాత్రం గోచరించదు, కానీ, ఆ అంశాన్ని గ్రహించినందువల్ల కదా దానిమీదనుండి ప్రసరించే వాయువులో ఆ పూల సువాసన పరిమళిస్తుంది. ఈ విధంగా తనకు సమర్పించిన వస్తువులలో ఉండే సూక్ష్మమైన అంశాన్ని తాను గ్రహించి, భగవంతుడు తన అనుగ్రహంద్వారా ఒక విలక్షణమైన సూక్ష్మమైన అంశాన్ని ఆ వస్తువులలో చేర్చి, వాటిలో ఒక విలక్షణమైన గుణం ఏర్పడేటట్లు చేస్తాడు. ఇది అంతా భగవంతుని అనుగ్రహం వల్ల ఏర్పడుతుంది. అందువల్ల భగవంతునకు నివేదన చేసిన ప్రసాదంలో అంతకుముందు లేని ఒక విలక్షణమైన అంశం, గుణం కలుగుతుంది. గుణమే కాదు, అంతకు ముందు లేని ఒక గొప్ప రుచి కూడా అందులోఏర్పడుతుంది. ఈ విషయాన్ని భగవంతున్నివేదిత ప్రసాదం ఆస్వాదించిన పెద్దలు అనుభవ పూర్వకంగా చెబుతారు కూడా.

అందువల్ల మనకు లభించిన ఆహారాన్ని భగవంతునకు నివేదన చేసిన తరువాతనే భుజిద్దాం. తద్ద్వారా ఆ భగవంతుని కటాక్షాన్ని పొందడానికి ప్రయత్నం చేద్దాం. స్వస్తి.

# ఆళ్వార్ల పాశురాలలో స్వరభేదంలోని అర్ధవైలక్షణ్యం

దివ్యసూరులు అనుగ్రహించిన, ద్రావిడవేదం అనే దివ్యప్రబంధాలలోని పాశురాలలో ఒలి, ఓశై అనబడే స్వరంలోని భేదాల వల్ల చాలా అందమైన, రస్యమైన అర్థాలు గోచరిస్తాయి. సంస్కృత వేదంలో ఉదాత్తం, అనుదాత్తం, స్వరితం అనే మూడు విధాలయిన స్వర భేదాలు ఉన్నాయి. ఉన్నతమైన స్వరంతో తక్కువ స్వరంతో, సమానమైన స్వరంతో పదాలు, అక్షరాలు ఉచ్ఛరింపబడినప్పుడు, ఆ స్వరాలు ఈ పేర్లతో వ నిర్దేశింపబడతాయి. ఉన్నత స్వరంతో చెప్పినప్పుడు ఉదాత్తమని, మంద స్వరంతో చెప్పినప్పుడు అనుదాత్తమని, సమమైన, ఈ రెండిటి కలయికతో కూడిన స్వరంలో చెప్పినప్పుడు స్వరితమని పేరు. ఈ విధంగా ఉండే స్వరభేదంవల్ల సంస్కృత వేదంలో అర్థభేదం కూడా చెప్పబడింది. ఆవశ్యకమైన అర్థాన్ని ఇచ్చే స్వరంలో ఆ యా పదాలను, అక్షరాలను ఉచ్ఛరించకపోతే, ఆశించిన అర్థం సిద్ధించకపోవడమేకాక, అనర్థం కూడా సంభవిస్తుంది —అనే విషయాన్ని వృత్రాసురుని కథలో గల ఇంద్రశత్రు శబ్దోచ్చారణసందర్భం తెలియజేస్తున్నది కూడా.

ఇదేవిధంగా, ద్రావిడ వేదంలోని పాశురాలలోని పదాలను ఉచ్ఛరించేటప్పుడు, కొన్ని పదాలలో స్వరం, ఆ పదాల ద్వారా ఆ సందర్భంగా స్ఫురించే అర్థాన్ని బట్టి, ఉన్నతంగా, లేక, మందంగా, లేక, సమంగా అనుసరించే విధానం ఉన్నది. ఆ రీతిలో వేరు వేరు స్వరాలతో ఉచ్ఛరించినప్పుడు, వేరు వేరు అర్థాలు తోచే సందర్భాలు కూడా ద్రావిడ వేదంలో మనకు చాలా గోచరిస్తాయి. అవి పూర్వాచార్య వ్యాఖ్యానాలలో సూచింపబడ్డాయి కూడా. ఉదాహరణగా ఒకటి రెండు సందర్భాలు ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

తొండరడి ప్పొడి ఆళ్వార్లు అనుగ్రహించిన తిరుమాలై ప్రబంధంలోని ఈ క్రింది నాల్గవ పాశురాన్ని గమనించండి.

మొయ్ త్త వల్వినైయుళ్ నిన్ఱు * మూన్ఱెళుత్తుడైయ పేరాల్ *
కత్తిరబందు మన్ఱే * పరాంగతి కణ్డు కొణ్డాన్ **
ఇత్తనై అడియర్ ఆనార్క్కు * ఇరంగు నమ్మరంగనాయ *
పిత్తనై ప్పెఱ్ఱుమ్ అందో! * పిఱవియుళ్ పిణంగుమాఱే!

ఎటువంటివారు భగవంతుని నామాలను ఉచ్చరించినా, వారికి ఆ నామానుసంధానంవల్ల పలం కలుగుతుంది. ఎటువంటి క్రూరమైన పాపాలు చేసినవారికైనా భగవన్నామానుసంధానం వల్ల మన్నింపు కలుగుతుంది. వారి పాపాలు తీరిపోతాయి. –అని అంటూ ఈ పాశురంలో అళ్వారులు తెలియజేస్తున్నారు.

గతంలోఎటువంటి తీవ్రమైన పాపాలను చేసినవారు అయినప్పటికీ, వారు మూడు అక్షరాలను కలిగిన మాధవ, కేశవ, గోవింద మొదలైన భగవంతుని నామాలను ఉచ్చరించి, పాప విముక్తిని పొందవచ్చు. చాలా కఠినమైన పాపాలను చేసిన క్షత్రబంధువు అనేవాడుకూడా భగవంతుని నామానుసంధానం వల్ల పాపవిమోచనాన్ని, పరగతిని పొందాడు. క్షత్ర బంధువు చాలా నీచమైన ప్రవర్తనను కలవాడు. ఏ మాత్రం శీలాన్ని లేనివాడు. అతడు చేసిన పాపాలకు అంతు లేదు. అయినా, అతడు చేసిన భగవంతుని నామానుసంధానంవల్ల అతని తీవ్రమైన పాపాలు అన్నీ మన్నింపబడ్డాయి. అతడు గతంలో చేసిన పాపాలు అన్నీ నశించగా, అతడు పరగతిని పొందాడు– అని ఇందులో అళ్వార్లు అంటున్నారు.

ఈ పాశురంలోని మూడవ పాదం ఆరంభంలో "ఇత్తనై అడియరానార్ క్కు ఇరంగుమ్ నమ్ అరంగనాయ పిత్తనై ప్పెఱ్ఱుమ్ అందో! పిఱవియుళ్ పిణంగుమాఱే!"

– (ఇంతటి భక్తిని కలవారికి అనుగ్రహించే మన శ్రీరంగనాథుడనే వ్యామోహాన్ని కలిగినవానిని పొంది కూడా, అయ్యో! ఈ సంసారంలో పడి బాధపడుతున్నారే!) అనే ప్రయోగాన్ని ఇక్కడ గమనించాలి. "ఇత్తనై అడియరానార్ క్కు" –ఇంతటి అల్పమైన భక్తి కలిగినవారికి కూడా శ్రీరంగనాథుడు అనుగ్రహిస్తాడు, ఎవరిలోనూ భక్తి చాలా గొప్పగా ఉండాలని అతడు ఎదురు చూడటం లేదు. వీరు మన బిడ్డలే కదా! అని భావించి అతడు ఉన్నాడు.
– ఈ విధంగా ఏదో ఒక చిన్న సత్కార్యాన్ని చూచి కూడా అనాదికాలంగా చేసిన తీవ్రమైన పలు పాపాలను కూడా సహించి క్షమించే పిచ్చివాడు, వత్సలుడు. లోకంలో ఈ ఈ పాపాలకు, ఈ ఈ విధమైన దండన విధించాలనే ఒక క్రమం ఉన్నదికదా. ఇటువంటి క్రమాన్ని కూడా కాదని, ఎటువంటి పాపాన్ని అయినా క్షమించేవాడైనప్పుడు స్వామి పిచ్చివాడేకదా. అటువంటి వత్సలుడైన శ్రీరంగనాథుని మనం పొంది కూడా, పాపాలను పోగొట్టుకోకుండానే, ఇంకా ఇంకా సంసారంలోనే పడి ఉన్నారే పడి ఉన్నారే! వీరిని గురించి ఏమని చెప్పాలి! అయ్యో! అని ఆళ్వారులు ఇక్కడ అనుశోకిస్తున్నారు.

ఇక్కడ ఈ పాశురంలోని "ఇత్తనై అడియరానార్ క్కు" అనే ప్రయోగాన్ని ఏ విధంగా ఉచ్చరించాలి? అనేది ప్రస్తుత విషయం. ఈ ప్రయోగాన్ని ఉన్నత స్వరంతో ఉచ్చరించకూడదు. ఉన్నత స్వరంతో ఉచ్చరిస్తే, "ఇంతటి ఉన్నతభక్తి కలిగినవారికి మాత్రమే భగవంతుడు అనుగ్రహాన్ని చూపిస్తాడు" అనే భావం వస్తుంది. ఆ భావం ప్రకృతంలో పొసగదు కదా. వశిష్ఠుని వలె, విశ్వామిత్రునివలె, నమ్మాళ్వార్లవలె గొప్ప భక్తి కలిగినవారికి మాత్రమే భగవంతుడు అనుగ్రహిస్తాడు అంటే, అంతవరకు మనకు భగవంతునిపై ఉండే నమ్మిక కూడా సడలిపోతుందికదా.

అందుచేత, ఇక్కడ ఏ విధంగా ఈ ప్రయోగాన్ని ఉచ్చరించాలి? మందస్వరంతోనే ఉచ్చరించాలి ఆ విధంగా ఉచ్చరిస్తే, "ఇంతటి చాలా అల్పమైన భక్తిని కలిగినవారికి కూడా అనుగ్రహించే మన శ్రీరంగనాథుడు తప్పక మనలను అనుగ్రహిస్తాడు. నామాలను

మంత్రాలుగా కూడా చెప్పనక్కరలేదు. నియమ నిష్ఠలతో కూడా చెప్పనక్కరలేదు. భగవన్నామాలను ఏదో ఒక విధంగా, ఏదో అల్పమైన భక్తితో చెబితే చాలు వింటే చాలు, అంతటి అల్పమైన భక్తి ఉన్నప్పటికీ, శ్రీరంగనాథుడు అనుగ్రహిస్తాడు– అనే అర్థం వచ్చే రీతిలో తక్కువ స్వరంతో ఈ ప్రయోగాన్ని ఉచ్చరించాలి. ఈ విధంగా మందస్వరంతో ఉచ్చరిస్తే, అప్పుడు ఈ ప్రయోగం వివక్షితమైన అర్థాన్ని తెలియజేస్తుంది. ఇది ఒక ఉదాహరణ

ఇప్పుడు ఇంకొక ఉదాహరణను నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధంలో గమనిద్దాం.

"యారు మోర్ నిలైమైయనెన అఱివరియ ఎంబెరుమాన్
యారు మోర్ నిలైమైయనెన అఱివెళియ ఎంబెరుమాన్"(1–3–)

అనే ఒక ప్రయోగాన్ని గమనించండి. ఇక్కడ, ఈ పాశురంలోని అర్థం ఏమి? ఎటువంటివారు అయినా, "ఇటువంటివాడు" అని తెలియడానికి సాధ్యం కానివాడు, భగవంతుడు. ఎటువంటివారు అయినా, "ఇటువంటివాడు" అని తెలుసుకోవడానికి సులభమైనవాడు, “భగవంతుడు” అనేది ఈ ప్రయోగంలోని అర్థం.

"తన విషయంలో భక్తి లేనివారు ఎటువంటివారైనా, ఎంతటి గొప్ప జ్ఞానం కలవారైనా వారికి తెలుసుకోవడానికి సాధ్యం కాకుండా ఉన్నవాడు, తన పట్ల భక్తి కలిగినవారు ఎటువంటివారైనా, వారికి తెలుసుకోవడానికి సులభంగా ఉండేవాడు"– అనే రెండర్థాలు ఈ ప్రయోగంలో ఉన్నాయి అందుచేత, మొదటి పాదంలో ఉండే "యారుమ్" అనే పదాన్ని, రెండవ పాదంలో ఉండే "యారుమ్" అనే పదాన్ని ఒకే విధమైన స్వరంతో ఉచ్చరించకూడదు. మొదటి పాదంలో ఉండే "యారుమ్" అనే పదాన్ని ఉచ్చరించినప్పుడు, ఉన్నతమైన స్వరంతో ఉచ్చరించాలి. అప్పుడు "బ్రహ్మ మొదలైనవారు ఎంతటి గొప్ప జ్ఞానం కలిగినవారు అయినా, వారు తన విషయంలో భక్తి

లేనివారు కనుక, వారికి భగవంతుడు అర్థం కాడు– అనే భావం వస్తుంది. ఈ అర్థమే ఇక్కడ వివక్షితం. కనుక, ఈ విధంగా ఉన్నతమైన స్వరంతోనే ఈ పదాన్ని ఉచ్చరించాలి.

ఆ విధంగానే, రెండవ పాదం ఆరంభంలో ఉండే "యారుమ్" అనే పదాన్ని మందస్వరంతో ఉచ్చరించాలి. ఆ విధంగా ఉచ్చరించినప్పుడు, "ఎంతటి అల్పమైన జ్ఞానం కలిగినవారైనా, వారు భక్తిని కలిగినవారు అయితే, వారికి భగవంతుడు తెలుసుకోవడానికి సులభంగా అవుతున్నాడు" అనే భావం వస్తుంది. ఈ భావమే ఇక్కడ వివక్షితం. కనుక, ఈ స్వరంలోనే ఈ పదాన్ని ఉచ్చరించాలి. అందుచేత, "యారుమ్" అనే ఒకే విధమైన పదం రెండు పాదాలలో ఉన్నప్పటికీ, ఈ పదాన్ని ఆ యా పాదాలలో చెప్పదలచిన అర్థానుసారంగా వేరు వేరు స్వరాలతో ఉచ్చరించినప్పుడే వివక్షితార్థం వస్తుంది. "ఎటువంటి జ్ఞానం కలిగినవాడైనా, భక్తి లేకపోతే భగవంతుని తెలియలేడు. ఎంత జ్ఞానం లేనివాడైనా, భక్తి కలవాడైతే, భగవంతుని తెలియగలడు" అనే పరస్పరం విలక్షణమైన అర్థాలు ఉచ్చారణలోని విలక్షణమైన స్వరాన్ని బట్టి స్ఫురిస్తున్నాయి.

మఱి ఒక ఉదాహరణను గమనించండి. తిరుమంగై ఆళ్వారులు పెరియ తిరుమొ*ழி* ప్రబంధంలో తేర*ழு*న్దూర్ అనే దివ్యదేశంలోని స్వామి దగ్గరకు పరకాలనాయకీ భావంతో దూతను పంపుతున్నారు. "తేమరువు మలరెడుత్త మలర్న్ద పోదై" అనే దశకంలో ఇది గోచరిస్తుంది. "ఓ పక్షీ! నీవు స్వామి దగ్గరకు నా దూతగా వెళ్ళు. ఈ పరకాలనాయిక వెక్కి వెక్కి రోదిస్తున్నది "అని చెప్పు– అని ఇక్కడ అంటున్నారు.

ఆ సందర్భంలో పరకాల నాయిక ఈ విధంగా అంటున్నది. "నీ మరువి అంజాదే నిన్నోర్ మాదు నిన్నయందాళ్ ఎన్నై ఇఱైయే ఇయంబిక్కాణేన్". నేను నిన్ను దూరంగా పంపించాను– అని ఆ స్వామి ముందుకు వెళ్లి చెప్పు. ఆయన ఏదో పని తొందరలో ఉండి

ఉంటాడు. నన్ను మరచి ఉంటాడు. నీవు వెళ్లి గుర్తు చేస్తే, ఆయనకు గుర్తుకు వస్తుంది. "నన్ను పరకాల నాయకి దూతగా పంపించింది"అని ధైర్యంగా స్వామి దగ్గర చెప్పు" అని నాయకి అన్నది.

అప్పుడు ఆ పక్షి నాయకితో "ఒకవేళ నేను స్వామి దగ్గరకుని దూతగా వెళితే, స్వామి నన్ను దండిస్తాడేమో? దెబ్బలు కొడతాడేమో? నిన్ను గురించి ఆ పెద్దమనిషి దగ్గర చెబితే, ఆయన కోపించి నన్ను బంధీ చేస్తే, నేను ఏమి చేయాలి? " అనే సందేహం వ్యక్తం చేసింది.

అప్పుడు పరకాల నాయకి "ఇళైయే ఇయంబి క్కాణేన్" అని అంటున్నది. "నీవు కొంచెం చెప్పి చూడు, ఏమవుతుందో చూస్తాను" అని దీని సాధారణమైన అర్థం. "నీ మరువి అంజాదే నిన్నోర్ మాదు నిన్నయందాళ్, ఎన్నై ఇళైయే ఇయంబి క్కాణేన్". —నీవు సందేహించకుండా "నిన్ను ఒక నాయిక ఇష్టపడింది" —అని నన్ను గూర్చి కొంచెం చెప్పి చూడు.

ఇక్కడ "ఇళైయే ఇయంబి, క్కాణేన్" అనే ప్రయోగాన్ని ఉచ్చరించేటపుడు స్వరంలోని భేదంవల్ల వేరు వేరు అర్థాలు స్ఫురిస్తాయి. సాధారణమైన స్వరంలో దీనిని ఉచ్చరిస్తే, " నీవు చెప్పి చూడు, తరువాత ఏమవుతుందో తెలియదు, చూద్దాం" అనే ఒక అర్థం వస్తుంది.

ఆ విధంగా కాకుండా, కొంచెం తక్కువ స్వరంతో "ఇళైయే ఇయంబి, క్కాణేన్" అనే ప్రయోగాన్ని అనుసంధిస్తే, "కొంచెం నీవు నాకోసం ఏమనుకోకుండా చెప్పి చూడు, ఏమవుతుందో చూస్తాం" అనే అర్థం వస్తుంది. "నాకోసం నువ్వు చెప్పి చూడు. ఒకవేళ

నీకు దెబ్బలు తగిలితే మాత్రం ఏమి నష్టం? ఇది పరోపకారం కదా! శ్రమపడి అయినా పరోపకారాన్ని చేయవద్దా! "అనే అర్థం ఇక్కడ భాసిస్తుంది. ఇది రెండవ అర్థం.

ఇక మూడవ అర్థం ఏమంటే, "నీవు చెప్పు. ఆ తరువాత ఏమవుతుందో చూడు!. స్వామి తప్పక నా దగ్గరకు పరిగెత్తుకుని వస్తాడు. ఏదో మరచిపోయాడు తప్ప, నీవు నన్ను గుర్తు చేస్తే స్వామి తప్పక నా దగ్గరకు వస్తాడో, లేదో చూడు! అతడు పరమ రసికుడుకదా!" అనేది మూడవ అర్థం. ఇది కొంచెం ఉచ్చైఃస్వరంతో ఈ ప్రయోగాన్ని చెప్పినప్పుడు వస్తుంది. ఇది "స్వామి తప్పక వస్తాడు" అనే నిశ్చయార్థాన్ని తెలుపుతుంది.

ఈ మూడు భిన్నార్థాలు మూడు వేరు వేరు స్వరాలతో ఈ ప్రయోగాన్ని చెప్పినప్పుడు వ్యక్తమవుతాయి. ఎంతటి అందమైన స్వరభేదాలు ఇవి! ఇటువంటి సందర్భాలు మనకు దివ్యప్రబంధాలలో వందలకొద్దీ గోచరిస్తాయి. ఇవి అన్నీ పూర్వాచార్య వ్యాఖ్యానగమ్యాలు, సహృదయైక వేద్యాలుకూడా. ఇది ఆళ్వార్ల పాశురాలలోని అత్యంత రస్యమైన, అవశ్యం గమనించదగిన ఒక అంశం. స్వస్తి.

# తులసీమహిమ

ప్రతిదినం మనం భగవంతుని ఆరాధనలో తులసిని చాలా ముఖ్యమైన పరికరంగా భావించి, ఉపయోగిస్తాము. అది లేనిదే భగవానుని ఆరాధన పూర్తి కాలేదని, కాదని భావిస్తాము. ఇది భగవంతునకు చాలా ఇష్టమైనదని కూడా శాస్త్రాలు తెలుపుతున్నాయి. ఆ తులసి మహిమనుగూర్చి కొంచెం తెలుసుకుందాం.

తులసికి కేశవప్రియ అనే పేరు ఉన్నది. భగవంతునకు చాలా ఇష్టమైనది అని దీని అర్థం. భగవంతుని ఆరాధనలో మరి ఏ విధమైన పుష్పం లేకపోయినాప్పటికీ, తులసిదళం ఒక్కటి ఉంటే చాలు, భగవంతుని ఆరాధన పూర్తి అవుతుంది– అని మనకు పెద్దలు చెబుతున్నారు, శాస్త్రాలు కూడా ఆవిధంగానే తెలుపు తున్నాయి.

తులసిని పూలకోటిలోనికి చేర్చవచ్చు, పత్రంగాను భావించవచ్చు. కృష్ణ తులసిలో నలుపు వర్ణం ఎక్కువగా ఉంటుంది. మిగిలిన తులసిలో పచ్చదనం ఎక్కువగా ఉంటుంది. తులసి తీర్థం ఆరోగ్యానికి చాలా మంచిది– అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. తులసీ మాల జపం చేయడానికి, కంఠంలో ఆభరణంగా ధరించటానికి ఉపయోగపడుతుంది. ఇటువంటి పలు విధాలయిన వైభవాలను కలిగినది, తులసి.

ఇప్పుడు తులసి అనే పదానికి ఉండే అర్థం ఏమిటో కొంచెం గమనిద్దాం తులసినిగురించి పురాణాలు తెలిపేటప్పుడు, "తులాం తులనాం, స్యతి నాశయతి" అంటే, సాటి లేనిది –అనే విధమైన వ్యుత్పత్తిని తెలియజేశాయి. ఒక వస్తువును తులనం చేయడం అంటే, దానిని త్రాసులో పెట్టి, దాని విలువలోని హెచ్చుతగ్గులను గమనించడం. దీనికి సమంగా ఏదైనా ఉన్నదా? అని చూడడం. తులా అంటే–సాదృశ్యం, అంటే పోలిక, తులనా అంటే –దీనితో పోలినది, సమానమైనది

ఏదైనా ఉన్నదా? అని గమనించడం. లోకంలో కూడా తుల అనే పేరు కలిగిన త్రాసును ఒక వస్తువును చూడడానికి ఉపయోగిస్తాము. ఒక వస్తువుయొక్క విలువను, దానితో సమానమైన బరువును కలిగిన వేరొక వస్తువును గమనించడంలో సాధనంగా ఉపయోగిస్తాము. ఇందువల్ల తులసి అనే పదానికి గల "తులాం స్యతి, నాశయతి" అనే వివరణంవల్ల, తనతో సమానమైన వేరొక వస్తువు ఏదీ లేని మహిమను కలిగినది— అనే భావం ఏర్పడుతున్నది. "సర్వోత్తమత్వాదేవ సాదృశ్యాభావాత్ అస్యా తథాత్వమ్"— (అన్నిటి కంటే ఉత్తమమైనది అయినందున, తనతో సాటి అయినది వేరొకటి లేదు కనుక, దీనికి ఆ పేరు వచ్చింది) అని తులసి పదం వివరింపబడింది. అందుచేత భగవంతునకు సమర్పించే అన్ని విధాలైన పుష్పాల కంటే, అన్ని పత్రాల కంటే తులసి చాలా విలక్షణమైనది కనుక, తనకు తులన, అంటే, సాటి వచ్చేది ఏదీ లేనందున, తులసికి ఆ పేరు వచ్చింది.

ఆళ్వార్లు ఒక చోట భగవంతునిగూర్చి పాశురాన్ని గానం చేసేటప్పుడు, "తుౙాయలంగల్ మాలైయాయ్" అని భగవంతుని నిర్దేశిస్తారు. తులసీమాలను ధరించినవాడు— అని దీని అర్థం. మనం భగవదాలయానికి ఎప్పుడు వెళ్ళినా, ఆలయానికి ముందు ఉండే పూల అంగళ్ళలో తులసీమాల సిద్ధం చేయబడి అమ్మకానికి ఉంటుంది. ఆ దుకాణదారులు "రండి! స్వామికి తులసీమాలను సమర్పించండి!" అని అంటూ పిలుస్తూ ఉంటారు. తులసీమాలను భగవంతుడు తన కిరీటంలోనూ అలంకరించుకోవచ్చు, భుజాలలోనూ అలంకరించుకోవచ్చు, లేక, తన పాదాలలో కూడా అలంకరించుకోవచ్చు. నమ్మాళ్వార్లు "తోళిణై మేలుమ్ నన్ మార్పిల్ మేలుమ్ శుడర్ముడి మేలుమ్ తాళిణై మేలుమ్ పునైంద తణ్ణమ్ తుౙాయ్ ముడి అమ్మాన్" (రెండు బాహువుల పైన, అందమైన వక్షఃస్థలం పైన, ప్రకాశించే కిరీటం పైన, రెండు పాదాల పైన తులసీమాలను అలంకరించుకున్న స్వామి) అని అన్నారు కదా. "తారాయ తణ్ తుళబ ——వన్మార్బన్ ఎన్గిన్హాళాల్" అని తిరుమంగై ఆళ్వార్లు. తులసీమాలను అలంకరించుకున్న పచ్చ స్థలాన్ని కలవాడు— అని అన్నారు. మిగిలిన ఆళ్వారులు

కూడా చాలా సందర్భాలలో భగవంతుడు తలసిని అలంకరించుకున్న అందమైన సన్నివేశాన్ని పాడి, ఆనందించారు.

తులసీమాలాధరుడు శ్రీమన్నారాయణుడు. ఇక్కడ ఈ నామానికి రెండు గొప్పతనాలు ఉన్నాయి. తులసీమాలను ఎవడు అలంకరించుకుంటాడో, అతడే పరమాత్మ –అని పురాణాల, అళ్వార్ల సూక్తులలో పలుమార్లు చెప్పబడింది. అంటే, తులసి ధరించడం– అనేది భగవంతుని సర్వాధికత్వ సూచకం. ఇందువల్లనే స్వామి శిరస్సుపై తులసిని ధరిస్తాడు. కనుక, ఇతడే సర్వాధికుడు –అని తెలుస్తున్నది.

ఈ నామంలోని ఇంకొక అర్థాన్ని గమనిద్దాం. తులసిని ధరించినందున స్వామి పరమ భోగ్యుడు, చాలా అందమైనవాడు– అనేది ఇక్కడ ఇంకొక అర్థం.

తులసిని ధరించినందు వల్ల అందరికీ నాథుడు –అనేది ఒక అర్థం అయితే, తులసిని ధరించినందు వల్ల స్వామి పరమ భోగ్యుడు, రమణీయుడు– అనేది ఇంకొక అర్థం. ఈ విధంగా నాథత్వం, పరమ భోగ్యత్వం అనేవి రెండు ఒకచోట ఉంటే, ఒక వ్యక్తిలో ఉంటే, ఆ వ్యక్తి ఏవిధంగా భాసిస్తాడు? ప్రకాశిస్తాడు? సర్వాధికుడుగా ప్రకాశిస్తాడు కదా. నాథుడై ఉండి, భోగ్యుడు కాకపోయినా ఉపయోగం లేదు. అతని దగ్గరకు మనం చేరము. భోగ్యుడై ఉండి నాథుడు కాకపోయినా ఉపయోగం లేదు. అటువంటివాని దగ్గరకు కూడా మనం చేరము. ఒకవేళ చేరినా, స్థిరంగా చిరకాలం ఉండము. ఈ విధంగా ఒకడు మనకు నాథుడై ఉండి, భోగ్యుడై ఉంటే, అటువంటివాడు మనకు ఆశ్రయించదగినవాడై ఉంటాడు కదా. అటువంటి వానితో మనం ఎప్పుడూ కలసి ఉండాలని కోరుకుంటాం. అదే ప్రాప్యత్వం అని చెప్పబడుతున్నది. ఈ విధంగా తులసీధారణం ప్రాప్యత్వ సూచకం.

భగవంతుడు తన శిరస్సుపై పచ్చగా అందంగా ఉండే, మధువును స్రవించే, ఆ మధువును ఆస్వాదించాలనే వచ్చే తుమ్మెదలను కలిగిన తులసిని తన కిరీటంలో

ధరిస్తున్నాడు. ఈ విధంగా తులసిని ధరించిన స్వామిని చూస్తే, ఒకవైపు అతని నాథత్వం మన మనసులో గోచరిస్తుంది. ఇంకొక వైపు అతని భోగ్యత్వం ప్రకాశిస్తుంది అటువంటి, స్వామిత్వభోగ్యత్వ విశిష్టుడైన స్వామిని మనం ఏనాటికి విడచి పెట్టము కదా. ఇదే ప్రాప్యత్వం.

ఇపుడు, తులసి అనే పదంలోని అర్థాన్ని గమనించినప్పుడు, తనకు సమానమైనది వేరొకటి లేదని తెలుస్తుందికదా. దీనివల్ల ఇక్కడ ప్రకాశించే వేరొక అర్థం ఏమంటే, తనకు వేరొకటి సాటి లేని, అందమైన తులసిని కిరీటంపై ధరించిన స్వామికి సమమైనవాడు, మించినవాడు ఎవడు లేడని, అతడే నాథుడని, పరమ భోగ్యుడని ఏర్పడుతున్నది. ఈ విధంగా తులసి సాటి లేనిది, తులసిని ధరించినవాడు కూడా సాటిలేనివాడు– అని తెలుస్తుంది కదా. తనతో సాటి అయినది ఏదీ లేదనే అర్థాన్ని కలిగిన తులసి తాను సాటిలేనిదై ఉండడమే కాకుండా, తనను ధరించినవానిని కూడా సాటిలేని వానినిగా చేస్తున్నది. ఇది ఎంతటి రస్యమైన అర్థం! ఇటువంటి సాటి లేని, అందమైన తులసిని మనం ప్రతినిత్యం తనకు ఏ సాటి లేని, అందమైన భగవంతుని ఆరాధనలో ఉపయోగించి, ఆ భగవంతుని ప్రసాదంగా స్వీకరిద్దాం, తరిద్దాం. స్వస్తి.

# పగలు– రాత్రి

దాసుడు– ఈ, ఏ, శింగరాచార్యులు.

మనం ఒక దినం అని వ్యవహరిస్తున్నాం. మన అభిప్రాయంలో దినం అంటే –ఒక పగలు, ఒక రాత్రి కలసిన కాలం. ఈ విధంగానే, మన దినం వలె, దేవతల దినం, బ్రహ్మదినం– అని ఈ విధంగా వేరు వేరుగా దినాల వ్యవస్థలు కూడా ఉన్నాయి. ప్రస్తుత విషయం ఈ విధంగా ఉండే వేరు వేరు దినాల వ్యవస్థను గూర్చినది కాదు.

ఒక భక్తుని కాని, ఒక వేదాంతిని కాని, దినం అంటే ఏమి? అని ప్రశ్నిస్తే, వారి అభిప్రాయం కాని, చెప్పే సమాధానం కాని వేరుగా ఉంటుంది. వారిని అడిగితే, సాధారణంగా లోకంలో ఉండే దినాన్నిగూర్చి చెప్పరు లోకంలో మనం వ్యవహరించే క్రమంలో, సూర్యుడు ఉదయించి ప్రకాశించే కాలం పగలు అని, సూర్యుడు అస్తమించి మరునాడు ఉదయించే వరకు ఉండే చీకటి కాలం రాత్రి అని అనబడుతుంది.

అయితే, ఎవడు పరబ్రహ్మను గూర్చి తెలియాలని భావిస్తాడో, ఆశపడతాడో, అతని దృష్టిలో ఈ విధమైన పగలు కానీ, లేక, రాత్రి కానీ ఒక విషయం కాదు. భగవంతుని గూర్చిన జ్ఞానం కలిగి ప్రకాశిస్తే, , ఆ పరమాత్మ విషయంలో అభినివేశం కలిగి అభివృద్ధి అయితే, అదే పగలు, అప్పుడే పగలు అని భావిస్తాడు. ఆ విధంగా లేకుండా, పరమాత్మను గూర్చిన జ్ఞానం మసకబారి, లేక, కలుగుకుండా ఉంటే, ఆ పరమాత్మకు చెందిన అనుభవం కాని, దర్శనం కాని, ఏర్పడకుండా ఉంటే, అది రాత్రి అని తలుస్తాడు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో రెండవ అధ్యాయంలో –"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" – భగవాన్మననశీలుడై ఉండే జ్ఞానికి, ఈ లోకంలో ప్రాణులంతా నిదురించే రాత్రి కాలం పగలు అవుతున్నది. ఆ సమయంలో అతడు మేల్కొని ఉంటాడు. ఏ సమయంలో అన్ని ప్రాణులు మెలకువగా ఉంటాయో, అది ఆ మునికి రాత్రి అవుతున్నది – అని అన్నాడు.

ఈ శ్లోకంద్వారా శ్రీకృష్ణుడు మనకు ఏమి చెబుతున్నాడు? మనకు లౌకికమైన విషయాలనుగూర్చిన జ్ఞానం అయితే, బాగా చక్కగా ఉన్నది. ఏమేమి చేయాలి, ఏమేమి చూడాలి, దేనిని దేనిని అనుభవించాలి— అనే లౌకికవిషయాలలో మనకు చక్కని జ్ఞానం ఉన్నది. వాటిని గూర్చిన ప్రకాశం మనకు ఉన్నది. అందువల్ల అది మనకు పగలు అవుతున్నది. కానీ, జ్ఞాని, ఈ లౌకికమైన విషయాల వైపు కన్ను పెట్టి చూడడు. కన్నులను మూసికొంటాడు. అందువల్ల, అవి అతనికి రాత్రి అవుతున్నది. ఆ జ్ఞానికి ఆత్మ, పరమాత్మ, ముక్తి, ముక్తిసాధనం, కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం, ప్రపత్తియోగం అని మొదలైన విషయాలను గూర్చిన జ్ఞానం అయితే స్పష్టంగా ప్రకాశిస్తున్నది. అందుచేత, ఆ జ్ఞానం కలగడం అతనికి పగలు అవుతున్నది. కానీ, మనకు ఈ విషయాల్లో ఏ విధమైన అవగాహన లేదు. ఆసక్తి లేదు, జ్ఞానం లేదు, అందుచేత అది మనకు రాత్రి. సాధారణంగా చెప్పాలంటే, ఏది మనకు పగలో, అది జ్ఞానికి రాత్రి. ఏది మనకు రాత్రియై ఉన్నదో, అది జ్ఞానికి పగలు. ఈ విషయమే పైన ప్రస్తావించిన శ్లోకంలో శ్రీకృష్ణుడు తెలియజేశాడు.

ఈ విధంగా రాత్రి, పగలు— అనే వీటి వ్యవస్థ జ్ఞానికి, అజ్ఞానికి వేరువేరుగా ఉన్నది. జ్ఞానికి సంబంధించినంతవరకు, ప్రకాశం అంటే— భగవంతునకు సంబంధించిన జ్ఞానం. పగలు అంటే— భగవంతునకు సంబంధించిన జ్ఞానం ప్రకాశించే కాలం. అందుచేతనే ఆళ్వార్లు "పగల్ కండేన్ నారణనై క్కండేన్"(పగటిని దర్శించాను, శ్రీమన్నారాయణుని దర్శించాను) అని అన్నారు. పగలు అంటే— భగవంతుని దర్శించిన కాలం— అని అంటున్నారు, ఆళ్వారులు. "నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణ పరో జ్యోతిః ఆత్మా నారాయణః పరః" అని అంటూ ఉపనిషత్తు నారాయణుడే పరంజ్యోతి, గొప్ప దీపం —అని అన్నది. మనం మన ఇంటిలో వెలిగించిన దీపంనుండి సూర్యునివరకు ఉండే తేజస్సును కల పదార్థాలు తేజస్సును ఇచ్చే పదార్థాలు అనే వీటికి అన్నిటికి తేజస్సును, కాంతిని ఇచ్చేవాడు ఆ భగవంతుడే. "తస్య భాసా సర్వమిదం విభాతి". అతడే నిజమైన ప్రకాశాన్ని కలవాడు. నిత్యమైన

ప్రకాశాన్ని కలవాడు. పూర్ణమైన ప్రకాశాన్ని కలవాడు. అందువల్ల, కేవలం పరిమితమైన, అల్పమైన, లౌకికమైన వెలుగును ఇచ్చే దీపాన్ని వెలిగించి, చీకటి పోయింది– అని ఏ విధంగా చెప్పడం? గాఢాంధకారం, దట్టమైన చీకటి– అనే అజ్ఞానమయమైన అంధకారం పోవాలంటే, ఈ విధంగా ఎన్ని దీపాలు వెలిగించినా అజ్ఞానాంధకారం పోదు. సూర్యుడు ఉదయించినా పోదు, చంద్రుడు ఉదయించినా పోదు, నిత్యమైన, పూర్ణమైన అద్భుతమైన తేజస్సును కలిగిన భగవంతుడనే సూర్యుడు ప్రకాశిస్తేనే ఆ చీకటి నశిస్తుంది. పగలు అవుతుంది. రాత్రి తీరుతుంది, తెల్లవారుతుంది. వెలుగు వస్తేనే రాత్రి పోతుంది. ఆ వెలుగు– భగవంతునిగూర్చి ఉపదేశించే సదాచార్యుల ఉపదేశాలు. అందుచేత అవికూడా, దీపంవలెనే, చీకటిని పోగొట్టగలవు.

అందుచేత, రాత్రి పగలు అనేవి అందరికీ ఒకే విధంగా ఉండవు. జ్ఞానుల విషయంలో పగలు, రాత్రి వ్యవస్థ వేరు, మనవంటి లౌకికుల దృష్టిలో పగలు, రాత్రి వ్యవస్థ వేరు. ఈ వ్యత్యాసాన్ని గమనించి, మనం జీవనప్రయాణాన్ని సవ్యంగా సాగిస్తే, మనం నిజమైన పగలును దర్శించవచ్చు, రాత్రిని తీర్చుకోవచ్చు. స్వస్తి.

# అరుళాళ పెరుమాళ్ ఎంబెరుమానార్ వైభవమ్

ముందుగా వీరి చరిత్రను సంగ్రహంగా తెలిసికొందాం.

పూర్వాశ్రమంలో యజ్ఞమూర్తి అనే పేరు కలిగిన ఈ ఆచార్యవర్యులు కార్తీకమాసం, అంటే, సౌరమానం ప్రకారం వృశ్చిక మాసంలో, భరణీ నక్షత్రంలో అవతరించారు. వీరు మొదట అద్వైత మతస్థులై ఉండేవారు. తరువాత వీరు భగవద్రామానుజులచే సంస్కరింపబడిన వృత్తాంతం ఈ విధంగా ఉన్నది.

యజ్ఞమూర్తి అనే పేరు కలిగిన అద్వైత పండితసన్యాసి ఒకరు భగవద్రామానుజుల వైభవాన్ని విని, వారితో తర్కించి, వాదం చేయాలని, వారిని జయించాలని కోరి, శ్రీరంగానికి వచ్చి, వారిని సేవించి, "నేను అడిగే ప్రశ్నలకు అన్నిటికీ మీరు సమాధానం చెప్పాలి. మీరు నాకు తృప్తి కలిగేటట్లు సమాధానం చెప్పినట్లయితే, మీకు నేను శిష్యుడను కాగలను" అని చెప్పారు. భగవద్రామానుజులు కూడా దానికి అంగీకరించారు. 17 దినాలపాటు వారిద్దరి మధ్య వాదం "జయం ఎవరిది,? అపజయం ఎవరిది? " అనేది తెలియని విధంగా చాలా తీవ్రంగా జరిగింది. చివరిలో 17 వ నాడు, వాదనలో సమాధానాన్ని చెప్పవలసిన వంతు భగవద్రామానుజులకు వచ్చింది. అయితే, యజ్ఞమూర్తి అడిగిన ప్రశ్నకు ఏ సమాధానం చెప్పాలో శ్రీరామానుజులకు తోచనందున, "రేపు వాదాన్ని కొనసాగిద్దాం. ఈనాటికి వాదాన్ని ముగిద్దాం "అని చెప్పి, ఆనాటి వాదసభను ముగించడం జరిగింది.

మరునాడు వాదనలో యజ్ఞమూర్తి అడిగిన ప్రశ్నకు ఏమని సమాధానం చెప్పాలో ఏమీ తోచనందున, భగవద్రామానుజులకు మనసులో చాలా విచారం కలిగింది. తాము ఆరాధన చేసే అర్చామూర్తిని సేవించి, నివేదన చేసి, "ఆళ్వారుల కాలంనుండి శ్రీయామునుల వరకు ఇంతకాలంగా ఏ కొరతా లేకుండా ప్రకాశించిన ఈ దర్శనం ఇప్పుడు నా వల్ల భంగాన్ని పొందనున్నదా? ఈ విధంగా కూడా ఒక స్థితి ఏర్పడాలని

నీవు ఎందుకు సంకల్పించావు? అని విన్నపించి, తాము భుజించకుండానే విచారంగా నిద్రించారు. ఆనాటి రాత్రి భగవద్రామానుజులకు వరదరాజస్వామి కలలో కనిపించి, మాయావాది అయిన యజ్ఞమూర్తితో వాదించి, సమాధానం చెప్పడానికి వీలైన కొన్ని అర్థ విశేషాలను వారి మనసులో స్ఫురించేటట్లు చేసి, అంతర్ధానం అయ్యాడు. శ్రీరామానుజులు కూడా ప్రాతఃకాలంలో లేచి, చాలా సంతోషంతో తమ నిత్యానుష్ఠానాలను ముగించుకొని, ప్రసన్నవదనులై వాదసభకు వేంచేశారు.

ఆ సమయంలో సభకు యజ్ఞమూర్తి వచ్చి, శ్రీ రామానుజుల ముఖవికాసాన్ని దర్శించి, "ఈనాడు నాకు అపజయం తప్పదు" అని నిశ్చయించుకుని, అప్పుడే భగవద్రామానుజుల దగ్గరకు వచ్చి, వారి శ్రీ చరణాలలో సాష్టాంగంగా ప్రణామం చేసి, " నన్ను మీరు శిష్యునిగా అంగీకరించాలి" అని అంజలి ఘటించి నిలువగా, " ఇకపై మనం వాదవిచారం చేయవలసి ఉండగా, ఇదేమి మీరు ఈ విధంగా అంటున్నారు? " అని శ్రీరామానుజులు అడిగారు. దానికి యజ్ఞమూర్తి సమాధానంగా, " స్వామీ! నీకు శ్రీరంగనాథుడు ప్రత్యక్షం అయిన తర్వాత, మీకు ఆ స్వామికి భేదం ఉన్నదా? ఇక, మీ సన్నిధిలో నోరు తెరిచి ఏ ఒక్క మాట కూడా చెప్పే యోగ్యత నాకు లేదు. ఈ ఆత్మ ఇంతవరకు అనర్థపడినది చాలు. ఇకపై కూడా ఆ విధంగా అధి అనర్థాన్ని పొందకుండా మీరు అనుగ్రహించాలి" అని గట్టిగా ప్రార్థించి, శ్రీరామానుజుల అంగీకారాన్ని పొందారు. అప్పుడే ఏకదండాన్ని విసర్జించి, ప్రాయశ్చిత్త పూర్వకంగా శిఖాయజ్ఞోపవీతాలను ధరించి, పంచసంస్కారాలను పొంది, త్రిదండాన్ని ధరించిన సన్యాసి అయ్యారు. ఆచార్యులైన శ్రీరామానుజుల నామాన్ని ధరించాలని కోరి ప్రార్థించగా, శ్రీరామానుజులు కూడా " శ్రీవరదరాజస్వామి ప్రసాదంగానే వీరు తమకు వశమయ్యారు" అనే ఉపకారస్మృతి లోకంలో ప్రసిద్ధం అయ్యేటట్టుగా అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమనార్ అనే పేరును వారికి పెట్టారు. వెంటనే వారిని తీసుకొని పోయి, శ్రీరంగనాథుని సేవింపజేసి, గౌరవ మర్యాదలను వారికి కలుగజేశారు. ఆనాటినుండి ఆరంభించి నాలాయిర దివ్యప్రబంధాన్ని వారికి నేర్పించి, మిగిలిన తత్త్వవిశేషాలను కూడా బోధించారు.

ఆకాలంలో, అనంతార్యులు, తొండనూర్ నంబి, మరుదూర్ నంబి అనేవారు భగవద్రామానుజులను ఆశ్రయించాలని రాగా, వారు వారిని అందరినీ అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ శ్రీచరణాలను ఆశ్రయించేటట్లు చేశారు. అప్పుడు అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ చాలా భయపడి, భయపడి జంకి, "ఒక పిచ్చుక మెడకు పనసకాయను కట్టినట్లుగా, నాకు ఈ బాధ్యతను శ్రీరామానుజులు అప్పగించినప్పటికీ, మీరు ఎప్పటికీ వారి శ్రీచరణాలే శరణమని నమ్మి ఉండండి" అని నియమించారు.

వీరు జ్ఞానసారం, ప్రమేయసారం –అనే రెండు అద్భుతమైన ద్రావిడ గ్రంథాలను అనుగ్రహించారు. ఇవి, ప్రపన్నుడైనవాడు తప్పక తెలియవలసిన రహస్యార్థాలను సంగ్రహించి తెలుపుతున్నవి.

ఇప్పుడు, దివ్య ప్రబంధవ్యాఖ్యానాలలో గోచరించే, ఈ ఆచార్యులకు సంబంధించిన, ఆరు సందర్భాలలోని ఐతిహ్యాలను, వార్తలను గమనిద్దాం. వీటి ద్వారా గోచరించే, శ్రీ అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ వ్యక్తిత్వంలోని విశేషాలన కూడా గమనిద్దాం.

1) అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమనార్ కు కల సంప్రదాయనిష్ఠ

పెరియాళ్వార్ తిరుమొళి–(4–4–7)

"పత్తర్ ఇరుంద ఊరిల్ ఇరుక్కుమ్ మానిడర్ ఎత్తవమ్ శెయ్ దార్ కొలో!" (భక్తులు నివసించే ఊరిలో నివసించగలిగినవారు ఎంత భాగ్యాన్ని పొందారో కదా!) అని అంటున్నారు, పెరియాళ్వారులు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే శ్రీవరవరములు "ఆచార్య శ్రీచరణాలను అశ్రయించడమే ఆశపడదగినది" అనే విషయాన్ని తెలుపుతూ, ఇక్కడ వ్యాఖ్యానంలో అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ కు సంబంధించిన ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తున్నారు.

ఒకరిని గూర్చి ఇంకొకరు చెప్పేటప్పుడు వారి స్వభావానికి గొప్పతనానికి తగినట్టుగా చెప్పాలి. భాగవతులు ఎవరైనా పరమపదించినప్పుడు, " వారు మరణించారు" అని చెప్పకూడదు. "వారు తిరునాడుకు వేంచేశారు " అనే చెప్పాలి– అని ఇంతకుముందు వ్యాఖ్యానంలో చెప్పబడింది. ఈ విషయంలో, "ఆచార్యభక్తిని కలిగినవారినిగూర్చి ఏ విధంగా విలక్షణంగా చెప్పాలి? " అనే విషయాన్ని తెలుపడం కోసం ఒక ఐతిహ్యం ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది.

శ్రీరామానుజుల విషయంలో చాలా భక్తిని కలిగిన వడుగనంబి పరమపదించిన వార్తను అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమనార్ దగ్గర తెలియజేసేవారు ఒకరు "వడుగనంబి తిరునాడుకు వెళ్ళారు "అని అన్నారట. వెంటనే ఎంబెరుమనార్ ఆ మాటను విన్న అదురుపాటుచేత మూర్ఛపోయారట. తరువాత, కొంతసేపటికి తెలివి తెచ్చుకొని, వడుగనంబి శ్రీరామానుజుల విషయంలో చాలా భక్తిని కలిగినవారు అందుచేత వారినిగూర్చి " తిరునాడుకు పోయారు" అని చెప్పకూడదు. వారి ఆచార్యభక్తికి తగినట్లుగా "శ్రీరామానుజుల శ్రీచరణాలను చేరారు"– అనే చెప్పాలి "అని అన్నారట.

ఇందువల్ల భాగవతుల విషయంలో భక్తిని కలిగినవారు పరమపదిస్తే, " తిరునాడుకు వేంచేశారు" అని చెప్పాలి అనేది ఇంతకు ముందు వ్యాఖ్యానంలో చెప్పబడినా, ఆచార్యుల విషయంలో అంతు లేని భక్తి కలిగినవారు పరమపదించినప్పుడు, "ఆచార్యశ్రీచరణసన్నిధిని చేరారు" అనే చెప్పాలిర–అనే సత్ సంప్రదాయం తెలియడమే కాక, అరుళాళ ప్పెరుమాళ్ ఎంబరుమనార్ కు కల సంప్రదాయ నిష్ఠ ఎంత గొప్పదో తెలుస్తున్నది.

2) ఆచార్యానుగ్రహాన్ని పూర్ణంగా పొందిన అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్

పెరియాళ్వార్ తిరుమొళి– (4– 8 –3) (తిరువాయ్ మొళి ప్పిళ్లై వ్యాఖ్యానం)

"శిఱప్పుడైయ మఱైయవర్ వాழ் తిరువరంగమ్" (గొప్పతనాన్ని కలిగిన వేదవిద్వాంసులు నివసించే శ్రీరంగం) అని పెరియాళ్వార్లు అనుగ్రహించారు. ఇక్కడ, వేదవిద్వాంసులకు ఉండే గొప్పతనం ఏమంటే, గొప్ప శిష్యులను కలిగి ఉండడమే– అనే భావంలో దీనికి వ్యాఖ్యానం చేసే వ్యాఖ్యాత గొప్ప శిష్యులను పొందిన ఆచార్యులను కొందరిని ఉదాహరణంగా ప్రస్తావించారు.

తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్, అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ మొదలైనవారిని శ్రీరామానుజులు మిక్కిలి అభిమానించి, వారిని కటాక్షించినట్లు, శ్రీరామానుజులను పెరియనంబి మొదలైన ఆచార్యులు అభిమానించినట్లు, నంబిళ్లైయను నంజీయర్ అభిమానించినట్లు, తమ కుమారుడైన పిళ్ళైయిలోకాచార్యులవారిని వడక్కుత్తిరువీది ప్పిళ్ళై అనే ఆచార్యులు అభిమానించినట్లు, గొప్ప శిష్యులను పొంది, వారిని వృద్ధి చేసినందున తగిన ప్రయోజనాన్ని పొందిన వైదికులు నివసించే శ్రీరంగం –అని ఇక్కడ వ్యాఖ్యాత వివరించారు.

దీనివల్ల అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ తమ ఆచార్యులైన శ్రీ రామానుజుల కటాక్షాన్ని, అభిమానాన్ని పరిపూర్ణంగా, విశేషంగా పొందారు –అని తెలుస్తున్నది. ఇది వీరి శిష్య లక్షణ పూర్తిని తెలుపుతుంది

3) విలక్షణమైన జ్ఞానాన్ని కలిగిన శిష్యులను పొందినవారు అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్

తిరువిరుత్తమ్– నంబిళ్ళై వ్యాఖ్యానమ్– ప్రవేశమ్

తిరువిరుత్తం అనే దివ్య ప్రబంధాన్ని అనుగ్రహించిన నమ్మాళ్వారుల గొప్పతనాన్ని తమ వ్యాఖ్యాన ప్రవేశంలో ముందుగా ప్రస్తావించే నంబిళ్ళై, ఈ సందర్భంగా ఆచార్యులు కొందరు పలికిన సూక్తులను ఉదాహరిస్తూ, ఈ విధంగా అన్నారు.

"నమ్మాళ్వారులు ముక్తులు" అని కొందరు అంటారు. (ముక్తులు అంటే –ఈ లోకంలో కొంతకాలం సంసార బంధాన్ని కలిగినవారై, తరువాత, ఆ బంధంనుండి ముక్తిని పొందినవారు– అని అర్థం) అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అనే ఆచార్యుల శిష్యులు ఒకరు "ముక్తప్రాయులు"(అంటే, ఈ లోకంలోని సుఖదుఃఖాలు ఏమీ కలవకుండా ఉండదగిన శ్వేతద్వీపంలో ఉండేవారు) అని అనేవారు. అంటే, శ్వేతదీపంలో ఉండే ముక్తప్రాయులు ఒకరు మనలను సంస్కరించడం కోసం ఇక్కడికి వచ్చి ఆళ్వార్లుగా అవతరించారు– అని వారు అనేవారు. పరమపదంలో ఉండే నిత్యసూరులలో ఒకరు "మీరు భూలోకంలో జన్మించి, అక్కడ ఉండేవారిని సంస్కరించాలి" అని భగవంతుడు ఆజ్ఞాపించగా, దాని ప్రకారం ఈ లోకంలో ఒక నిత్యసూరులే ఈ విధంగా ఆళ్వార్లుగా అవతరించారు– అని కొందరు అంటారు. వంగిపురత్తు నంబి అనే ఆచార్యులు "ఈ లోకంలో ఉండేవారిని సంస్కరించడం కోసం భగవంతుడే అళ్వార్లుగా వచ్చి అవతరించాడు" అని అంటారు. ఈ విధంగా పలువురు పలు విధాలుగా చెప్పడానికి కారణం ఆళ్వారుల మహిమయే. నిజానికి ఆళ్వారులు సంసారులలో ఒకరు.

ఈ వార్త వల్ల, విలక్షణమైన జ్ఞానాన్ని కలిగిన శిష్యులను కలవారు, వీరు– అని తెలుస్తున్నది. ఇది వీరి ఆచార్యత్వపూర్తిని తెలుపుతుంది.

4) అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరు మానార్ భాగవతప్రావణ్యం
తిరువాయ్ మొళి–(6–8–1) ఈడు వ్యాఖ్యానమ్

"పొన్నులకు ఆళిరో! పువని ముగ్ధుదు ఆళిరో!" అని అంటూ భగవంతుని దగ్గరకు తన దశను గూర్చి చెప్పమని పక్షులను దూతలుగా పంపుతూ, పరాంకుశ నాయకి ఆ పక్షులు చేసే సహాయానికి బదులుగా నిత్యవిభూతి, లీలావిభూతి అనే ఈ రెండు విభూతులను పాలించేటట్లుగా వాటికి ఇస్తానని అంటున్నది. ఈ రెండు లోకాలను పరాంకుశ నాయకి ఇష్టం వచ్చినట్లుగా, ఈ పక్షులకు ఇచ్చే అవధిలో భగవంతుడు ఈమెకు స్వాధీనం చేశాడు– అని వివరించే వ్యాఖ్యాత నంబిళ్ళై, ఈ సందర్భంలో ఈ క్రింది ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తున్నారు.

అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ తమ శరీరంలో బాగా బాధపడుతూ, అంతిమ సమయంలో ఉండేటప్పుడు, వారిని పరామర్శించడం కోసం కూరేశులు, పిళ్లై ఉఱంగా విల్లిదాసర్ తో పాటు వెళ్లారు. అప్పుడు అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ "కూరేశులు కలిగించిన మనస్తాపం తీరడం శ్రీయామునుల శ్రీచరణాలను చేరినప్పుడు కదా"–అని అన్నారు. –అనే ఐతిహ్యాన్ని నంబిళ్ళై ఇక్కడ ఉదాహరించారు.

పరమపదాన్ని ఇచ్చే అనుగ్రహించే సామర్థ్యం కూరేశులకు ఉన్నప్పటికీ, వారు తమకు ఆ విధంగా పరమ పదాన్ని అనుగ్రహించనందు వల్ల, తాము చాలా మనస్తాపాన్ని చెందినట్లు, ఆ సమయంలో తమ బాధను విచారించడానికి కూరేశులు వచ్చినట్లు గమనించి, "తమకు ఏర్పడిన దుఃఖం పరమపదానికి పోయినప్పుడే తీరుతుంది "అని అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అన్నారు. తమ ఆచార్యులైన శ్రీరామానుజులు ఈ లోకంలో ఇంకా ఉన్నందున, "శ్రీయామునుల శ్రీచరణాలను చేరితే "అని అన్నారు.

ఈ ఐతిహ్యం వల్ల కూరేశులకు భగవంతుడు పరమ పదాన్ని స్వాధీనం చేసినట్లుగా అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమనార్ భావిస్తున్నారని, అందువల్లనే

వారు, తమకు కూరేశులు పరమపదాన్ని అనుగ్రహించనందున తమకు మనస్తాపం కలిగిందని భావించారని ఇక్కడ తెలుస్తున్నది. దీనివల్ల అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ "మోక్షాన్ని అనుగ్రహించే సామర్థ్యం భగవదనుగ్రహం కారణంగా ఆచార్యులకు ఉన్నద"ని భావిస్తున్నారని తెలుస్తున్నది.

5) అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరు మానార్ భగవద్గుణాభినివేశం
తిరువాయ్ మొళి–(6 –8–6) ఈడు వ్యాఖ్యానమ్

"తన్మన్ను నీళ్ కழల్ మేల్ తణ్ తుழాయ్ నమక్కన్ది నల్ కాన్" (స్వామి, తన, స్థిరంగా ఉండే, దీర్ఘమైన పాదాలపై అలంకరించుకున్న చల్లని తులసిని మనకు తప్ప ఇంకా ఎవరికీ అనుగ్రహించడు) అని భగవంతుడు తాను తన చరణాలపై అలంకరించుకున్న తులసిని తన భక్తులకు తప్ప, వేరు ఎవరికి ఇవ్వడు– అని అళ్వార్లు అనుగ్రహించార. భగవంతుడు భక్తులకే వశమైనవాడు –అని వివరించిన వ్యాఖ్యాత నంబిళ్ళై ఇక్కడ ఒక ఐతిహ్యాన్ని ఈ క్రింది విధంగా ప్రస్తావిస్తున్నారు. ఇందులో అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ ప్రస్తావం ఉన్నది.

అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ చివరి కాలంలో, వారి మనసులో అప్పుడు కదలాడే భావం ఏది? అనే విషయాన్నిగూర్చి కొందరు ప్రశ్నించగా, వారు, " ఒక పక్షి భగవంతుని మనస్సును గాయపరిచినది కదా –అని భావిస్తున్నాను" అని అన్నారట.

దీని తాత్పర్యం ఏమంటే –విభీషణుడు శ్రీరాముని శ్రీచరణాలను ఆశ్రయించాలని వచ్చినపుడు, అతనిని అంగీకరించకూడదు– అని సుగ్రీవుడు మొదలైనవారు అడ్డు చెప్పారు. శ్రీరాముడు తన స్వాతంత్ర్యంతో సుగ్రీవుడు మొదలైనవారి మాటలను కాదని విభీషణుని అంగీకరించి ఉండవచ్చు, అయితే, ఆ విధంగా చేయకుండా, భక్తులకు వశమై ఉండే తన నిజమైన స్వభావాన్ని వ్యక్తం చేయుడం కోసం "సుగ్రీవుడు మొదలైనవారిని

అంగీకరింపచేసి, తరువాతనే విభీషణుని స్వీకరించాలి"– అని భావించిన శ్రీరాముడు ఒక పక్షి కథ మొదలైనవాటిని చెప్పి, శరణాగతి ధర్మంలోని యథార్థమైన స్వరూపాన్ని వివరించాడు. " ఒక పక్షి తన గృహిణి అయిన ఆడపక్షిని అపహరించిన వేటగానికి తన ప్రాణాన్ని ఇచ్చి, అతని ఆకలిని తీర్చినది. అల్ప జ్ఞానాన్ని కలిగిన ఒక పక్షి చేసిన పనియే ఇటువంటిది అయితే, రఘుకులంలో పుట్టిన నేను ఎంతటి, ఎటువంటి కార్యాన్ని చేయాలి? " దోషో యద్యపి తస్య స్యాత్"– దోషాలను కలిగినవానిని కూడా నేను అంగీకరిస్తాను – అని నేను చెప్పినది కూడా ఇంతకుముందే ఒక పక్షి చెప్పినది. నేను ఇప్పుడు ఆ విధంగా చేసినా, అది ఇంతకుముందే ఒక పక్షి చేసిన పనియే కదా కాబోతుంది!, ఒక పక్షి తన ప్రాణాన్ని కూడా విడచిపెట్టి, వేటగానిని రక్షించినది. అయితే నేను ఆ విధంగా చేయలేకపోయానే!" అని శ్రీరాముని మనసు గాయపడింది. "ఈ విధంగా ఒక పక్షి భగవంతుని మనస్సును గాయపరిచిందే!" అని భావిస్తున్నాను– అని అరుళాళ పెరుమాళ్ ఎంబెరుమానార్ అనుగ్రహించారు.

దీనిలోని తాత్పర్యాన్ని వివరిస్తూ నంబిళ్ళై ఈ విధంగా అన్నారు.

వేటగాని ప్రయత్నం కారణంగా అతడు కాపాడబడలేదు. పక్షికి కల మంచి గుణాలవల్లనే అతడు కాపాడబడ్డాడు. ఆ విధంగానే, మనం చేసే శరణాగతి మనకు ఫలాన్ని ఇవ్వదు. శరణ్యుడైన భగవంతుని సౌలభ్యం మొదలైన కళ్యాణ గుణాలే మనకు ఫలాన్ని ఇస్తాయి. అందుచేత, ఏ కొరత లేదు– నంబిళ్ళై అని అన్నారు.

"తన నివాసం అయిన చెట్టు మూలంలోకి ఈ వేటగాడు వచ్చిచేరాడు" అనే ఒక్క కారణంతోనే పక్షి, తన జాలి అనే గుణం వల్ల తనకు నేరుగా అపకారం చేసిన ఆ వేటగాని ప్రాణాన్ని సైతం రక్షించింది. అయితే, ఆ పక్షి తనను రక్షించగలదు– అని తెలియకుండానే, ఆ పక్షి నివసించే చెట్టు మూలం దగ్గరకు వచ్చి చేరాడు, వేటగాడు. ఆ వేటగాని వలె మనం కూడా అవుతున్నాం. మనకు ఫలం లభించడం భగవంతుని కరుణాగుణం చేతనే తప్ప, మనం చేసిన ప్రయత్నంచేత కాదు– అని ఇక్కడ భావం.

ఈ ఐతిహ్యం వల్ల అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ భగవంతుని కరుణ మొదలైన కల్యాణగుణాలలతో ఎంతటి అభినివేశాన్ని కలవారో, తెలుస్తున్నది.

6) అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరు మానార్ వ్యక్తిత్వంలోని గొప్పతనం
తిరువాయ్ మొళి –(8 –10 –3) ఈడు వ్యాఖ్యానమ్

భగవద్భక్తుల గొప్పతనాన్ని గూర్చి పలికే నమ్మాళ్వారులు వారిని "శిఱుమామనిశర్" అని కీర్తించారు. దీనిని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై ఈ క్రింది ఐతిహ్యాన్ని ప్రస్తుతించారు.

పరాశరభట్టర్ అనితర సాధారణమైన మేధావిలాసాన్ని కలవారు. వారు తమ చిన్నతనంలోనే తమ తండ్రిగారైన కూరేశుల దగ్గరకు వెళ్లి, "శిఱుమామనిశర్" అని అంటే, "చిన్నతనాన్ని, పెద్దతనాన్ని కలవారు" అనే అర్థం వస్తున్నది కదా. చిన్నతనం, పెద్దతనం– అనే రెండు స్వభావాలు పరస్పరం విరుద్ధమైనవి కదా! ఇవి రెండు ఒకే వ్యక్తిలో ఏ విధంగా కలసి ఉండే అవకాశం ఉన్నది? అందుచేత, ఆళ్వారులు చిన్నతనం, పెద్దతనం– అనే రెండు కలిగిన దాసులు– అని అనడంలోని తాత్పర్యం ఏమి? అని ప్రశ్నించారు.

దీనికి కూరేశులు సమాధానం పలుకుతూ, " ముదలియాణ్డాన్, అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్, శ్రీ గోవింద ప్పెరుమాళ్ అనబడే ఎంబార్ మొదలైనవారు మనవలె అన్నపానీయాలను స్వీకరించేవారు అయినందున, మన వలె చిన్నతనాన్ని కలవారు అని కదా, తోస్తుంది. అయితే, వారికి భగవంతుని విషయంలో ఉండే అభినివేశాన్ని జాగ్రత్తగా గమనించి చూస్తే, చాలా గొప్పతనాన్ని కలిగినవారు–అని తెలుస్తుంది. అందుచేత రూపంలో చిన్నవారు అయినా, జ్ఞానంలో పెద్దవారైన ఇటువంటివారినే ఆళ్వారులు " శిఱుమామనిశర్" అని నిర్దేశించారు – అని అన్నారు.

ఈ ఐతిహ్యం వల్ల అరుళాళ పెరుమాళ్ ఎంబెరుమానార్ వ్యక్తిత్వ గౌరవం, జ్ఞానవైలక్షణ్యం మొదలైన తెలుపబడినవి.

ఇటువంటి, అరుళాళ పెరుమాళ్ ఎంబెరుమానార్ కు సంబంధించిన మరిన్ని విశేషాలు పూర్వాచార్యగ్రంథాలలో, రహస్యగ్రంథవ్యాఖ్యానాలలో లభించవచ్చు. వాటిని పెద్దల ద్వారా తెలియాలి. స్వస్తి.

# తిరుమంగై ఆழ்వార్ వాழி తిరునామ వైభవమ్

(ఉ. వే. శ్రీమాన్, డా. మాడభూషి వరదరాజన్ స్వామివారి ద్రావిడవివరణం ఆధారంగా)
దాసుడు– ఈ, ఏ, సింగరాచార్యులు.

తిరుమంగై ఆழ்వార్ కార్తీక మాసం కృత్తికా నక్షత్రంలో తిరుక్కుఱైయలూర్ అనే దివ్యక్షేత్రంలో భగవంతుని శ్రీ శార్ఙ్గం అనబడే విల్లు యొక్క అంశతో అవతరించారు. వీరు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు ఆరు. అవి, పెరియ తిరుమొழி, తిరుక్కుఱుందాండగమ్, తిరు వెழுకూற்ఱిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్, తిరు నెడుందాండగమ్ అనేవి.

**వీరి వాழி తిరునామపాశురం**

కలంద తిరుక్కార్ త్తికైయిల్ కార్ త్తికై వందోన్ వాழியే
కాశినియిల్ కుఱైయలూర్ కావలోన్ వాழியే
నలమ్ తికழ் ఆయిరత్తు ఎణ్బత్తు నాలురైత్తాన్ వాழியే
నాలైందుమ్ ఆఱైందుమ్ నమక్కురైత్తాన్ వాழியే
ఇలఙ్గెழுకూற்ఱిరుక్కై ఇరుమడలీందాన్ వాழியే
ఇమ్మూన్ఱిల్ ఇరునూற்ఱిరుత్తేழீన్దాన్ వాழியే
వలమ్ తిగழுమ్ కుమదవల్లి మణవాళన్ వాழியే
వాట్కలియన్ పరకాలన్ మంగైయర్ కోన్ వాழியే.

దీని తాత్పర్యం ఏమంటే–

గొప్పతనాన్ని కలిగిన కార్తీకమాసంలో కృతికా నక్షత్రంలో అవతరించినవారికి మంగళం. ఈ భూమిలో ప్రకాశించే తిరుక్కుఱైయలూర్ అనే ఊరుకు రక్షకులైనవారికి మంగళం. ప్రకాశాన్ని కలిగిన ఒక వెయ్యి 84 పాశురాలను కలిగిన పెరియ తిరుమొழி

ప్రబంధాన్ని అనుగ్రహించినవారికి మంగళం. 20 పాశురాలు కలిగిన తిరుక్కుఱుందాండగమ్ అనే ప్రబంధాన్ని, 30 పాశురాలను కల తిరు నెడుమ్ దాండగమ్ అనే ప్రబంధాన్ని దాసులమైన మనకు అనుగ్రహించినవారికి మంగళం, ప్రకాశించే తిరు వెழுకూఱ్ఱిరుక్కై అనే ప్రబంధాన్ని, శిఱియ తిరుమడల్, పెరియతిరుమడల్ అనే రెండు ప్రబంధాలను అనుగ్రహించినవారికి మంగళం, ఈ మూడింటిలో మొత్తం 227 పాశురాలను అనుగ్రహించినవారికి మంగళం. విజయంతో ప్రకాశించే కుముదవల్లి అనే కన్యకామణికి వరుడైనవారికి మంగళం. ఖడ్గాన్ని చేతిలో కలిగినవారై, కలి దోషాన్ని పోగొట్టినవారై, పరకాలురు అనే పేరు కలిగినవారై, తిరుమంగై అనే దివ్యదేశంలో ఉండేవారికి ప్రభువైన తిరుమంగై ఆళ్వారులకు మంగళం.

ఇక, ఈపాశురంలోని విశేషాలను కొంతవరకు గమనిద్దాం.

**(కలంద తిరుక్కార్ త్తిక్కైయిల్ కార్ త్తిక్కై వందోన్ వాழிయే)**

"కలంద్దై" అనే పదంలోని ఐకారం లోపించగా, "కలంద" అని అయింది. గొప్పతనం నిండుగా కలిగిన – అని దీని అర్థం.

**(తిరు క్కార్ త్తిక్కై)**– "తిరు" అనే పదం అతిశయాన్ని తెలియజేస్తుంది. ఇక్కడ కార్తీకమాసానికి ఉండే అతిశయం ఏమంటే– ఈ మాసంలో విష్ణ్వాలయాలలో దీపాలను వెలిగించడం, దీపాలను దానంగా ఇవ్వడం అనేది ఈ మాసానికి గల అతిశయం –అని విష్ణుధర్మం తెలుపుతున్నందున, ఈ విధమైన అతిశయాన్ని కలిగిన కార్తీకమాసంలో, దానికి తగిన గొప్పతనాన్ని కలిగిన కృతికా నక్షత్రంతో కూడిన దినంలో, చతుర్ధవర్ణంలో, కళ్ళర్ కులంలో, చోళ ప్రభువుకు సేనాధిపతిగా ఉండే ఒకరికి కుమారులై, నలనామ సంవత్సరం, కార్తీకమాసం పౌర్ణమితో కూడిన గురువారంనాడు కృత్తికా నక్షత్రంలో ఈ అళ్వార్లు అవతరించారు. " మంగైయర్ కోన్ మానిలత్తిల్ వందుదిత్త కార్ త్తిక్కైయిల్ కార్ త్తిక్కై నాళ్ " అని వేద, వేదాంగాలు అనే తత్వాలను తెలిసినవారై అవతరించినందున, మిగిలిన నక్షత్రాల కంటే వేరొక ఏ నక్షత్రానికి లేని గొప్పతనాన్ని కలిగినది అయినది–

కార్తీక మాసంలోని ఈ కృత్తికా నక్షత్రం. దీనికి తగినట్లు శ్రీ వరవరమునులు "వీఱుడైయ కార్ త్తికైయిల్ కార్ త్తికై నాళ్" అని ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో అనుగ్రహించడాన్ని గమనించవచ్చు.

**(కాశినియిల్ కుఱైయలూర్ కావలోన్ వాழ్ియే)** "కాశినీ– కాశతే ఇతి కాశినీ"– స్పష్టంగా ప్రకాశిస్తున్నది కనుక, "కాశినీ" అని భూమికి పేరు. " కాశినీ "అనే సంస్కృతశబ్దం ద్రావిడ భాషలో కాశిని అని మారి, స్పష్టంగా ప్రకాశించే భూమిని తెలియజేస్తుంది.

"మణ్ణియిల్ నీర్ తేంగుమ్ కుఱైయలూర్"– అని ఉపదేశ రత్న మాలై ప్రబంధంలో శ్రీమణవాళ మహామునులు పలికినట్లుగా, ఆళ్వార్లు అవతరించిన ఊరు, "మణ్ణి" అనే నదీ తీరంలో తిరువాలి తిరునగరితో చేరి, అందులో ఒక భాగం అనేటట్లుగా ఉండే తిరుక్కుఱైయులూర్ అనే దివ్యదేశం. అంతేకాక, ఈ ఊరు నిండుగా ఉండే నీటిని కలిగిన ఆళ్వార్ తిరునగరివలె, " పొంగు పునల్ మణ్ణి" (నిండుగా ఉండే జలాన్ని కలిగిన మణ్ణి నది) అనే విధంగా మణ్ణి అనే నదిలోని నీటిసమృద్ధిని కలిగి ఉంటుంది. ఆ నీటి సమృద్ధి చేత, సమృద్ధిగా పండిన సస్యాన్ని కలిగిన క్షేత్రాలను కలిగినదై ఉంటుంది, ఈ ఊరు. ఎల్లప్పుడూ దున్నడం, నాటడం, కలుపు తీయడం, పంటను కోయడం మొదలైన కార్యాలను నిరతంగా కలిగినదై ఉంటుంది– అని అంటారు. . అందువల్లనే, ఆముదనార్ ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాది ప్రబంధంలో " కలి మిక్క శెన్నెల్ క*ழ*ని కుక్కుఱైయిల్"(మిక్కిలి సారవంతమైన సస్యాన్ని కలిగిన పొలాలతో నిండిన తిరుక్కుఱైయలూర్) అని పల్కడాన్ని గమనించవచ్చు. ఇంతే కాకుండా, " తిరు" అనే గొప్పతనాన్ని సూచించే విశేషణాన్ని చేర్చి చెప్పేటప్పుడు, చోళమండలంలో ఉండే తిరువాలి అనే నగరం సమీపంలో, కరుణ నిండిన లక్ష్మీపతి నేత్రాల విలాసంతో పరిపూర్ణమైన వైభవాన్ని కలిగినది, తిరుక్కుఱైయలూర్– అని దివ్యసూరిచరితం తెలిపిన అర్థం ఇక్కడ కూడా స్ఫురిస్తుంది. అటువంటి తిరుక్కుఱైయలర్ కు, "కావలోన్ " అంటే– ప్రభువు– అని

అర్థం. దీనినిబట్టే ఈ అళ్వార్లే స్వయంగా "మంగైయర్ కోన్ కుఱైయలాళి" అని అన్నారు. అంటే, తిరుమంగై అనే ఊరుకు రక్షకుడు— అని అర్థం. శ్రీరామానుజులు కూడా పెరియ తిరుమొ*ళి* తనియన్ పాశురంలో "కుఱైయలూర్ వా*ళ* వేందన్" అని అన్నారు. అంటే, " తిరుక్కుఱైయలూర్ ను అవతార స్థలంగా కలిగినవారై, అది నివసించడానికి వీలుగా ఉండే చోటు అయేటట్లు దానిని రక్షించే ప్రభువు— అని కూడా అర్థం— అని పిళ్లైలోకమ్ జీయర్ వ్యాఖ్యానించారు. " వణ్ కుఱైయలూర్ వా*ళి*" అని అంటారు, పిళ్లై ఉఱంగా విల్లి దాసర్ కూడా.

**(నలమ్ తికళ ఆయిరత్తు ఎణ్బత్తు నాలురైత్తాన్ వా*ళి*యే)** తిరుమంగైఆళ్వార్ అనుగ్రహించిన 11 శతకాలను కలిగిన పెరియ తిరుమొ*ళి* అనే ప్రబంధం ఒక వెయ్యి 84 పాశురాలను కలిగినది. ఇక్కడ "నలమ్ తిగ*ళ*" అంటే— గొప్పతనం ప్రకాశించే— అని అర్థం. ఇక్కడ గొప్పతనం ఏమి? అంటే, ఈ ప్రబంధాలను "ఇన్బప్పాడల్" (ఆనందాన్ని కలిగించే పాశురాలు) అనే విధంగా అనుసంధించినవారికి అర్థంలోని రసంచేత, మాధుర్యంచేత ఆనందం మిక్కిలిగా కలిగి, అది కట్టలు తెగి ప్రవహించినందున, తన్మయత్వాస్థ కలిగి, "కలియన్ ఒలిమాలై" అనే విధంగా పెద్ద గొంతుకతో అనుసంధింపవలసి ఉన్నందున, "గొప్ప ధ్వనిని కలిగిన ప్రబంధం" అని అంటారు. ఈ ప్రబంధాలనే ధారకంగానూ, పోషకంగాను, భోగ్యంగాను భావిస్తూ, పూర్ణ భోజనంగా అనుభవించడమే —ఇక్కడ ఈ ప్రబంధంలో గొప్పతనం ప్రకాశించడం.

ఈ ప్రబంధంలో భారతదేశంలో ఉండే దివ్యదేశాలను కీర్తించాలని భావించి, ఆళ్వారులు మొదట ఉత్తరదేశంలోని 12 దివ్య దేశాలను మంగళాశాసనం చేసి, తరువాత దక్షిణ దేశంలోని తొండనాడులో ఉండే 23 దివ్యదేశాలను, చోళ మండలంలో ఉండే 39 దివ్యదేశాలను, పాండ్య మండలంలో ఉండే ఎనిమిది దివ్యదేశాలను, మలయాళ దేశంలో ఉండే మూడు దివ్యదేశాలను, మధ్య దేశంలో ఉండే రెండు దివ్యదేశాలను, ఈ విధంగా మొత్తం 87 దివ్యదేశాలను మంగళ శాసనం చేయడమే ఈ

ప్రబంధంలో గొప్పతనం ప్రకాశించడం. ఎంబార్ కూడా పెరియ తిరుమొ*ழி* ప్రబంధానికి తాము అనుగ్రహించిన తనియన్ పాశురంలో "పొంగు పుక*ழ்* ---ఆయిరమ్ అన్నైత్తుమ్" అని అన్నారు. అంటే, చాలా అభివృద్ధి చెందే కీర్తిని కలిగిన తిరుమంగై నగరానికి నాయకులైన ఆళ్వారులు అనుగ్రహించిన, వేదరూపమైన వేయి పాశురాలై ఉండే పెరియతిరుమొ*ழி* ప్రబంధం– అని అర్థం. ఇంతే కాక, ఈ ప్రబంధం మనసులోని అజ్ఞానాన్ని పోగొట్టే దీపం –అని, జన్మ అనే విషాన్ని పోగొట్టడానికి దివ్యమైన అమృతం– అని, అక్షరాలు, పదాలు, అర్థం, ఛందస్సు, అలంకారాలు– అనే ఐదు లక్షణాలకు నిండుతనాన్ని కలిగించే లక్ష్యం –అని, వేదంలోని సారం అని, ఇతర మతాలు అనే దూది సమూహానికి మహాగ్ని అనే ఐదు స్వభావాలను కలిగినది అయినది. వేదాంతదేశికులు కూడా "అఱివు తరుమ్ పెరియ తిరుమొ*ழி*" (జ్ఞానాన్ని కలిగించే పెరియ తిరుమొ*ழி*) అని అన్నారు.

**(నాలైందుమ్ ఆఱైందుమ్ నమ్మక్కురైత్తాన్ వా*ழி*యే)** "నాలైందు " అనేది– ఇరవై పాశురాలను కలిగిన తిరుక్కుఱుందాండగమ్ ను తెలుపుతుంది. "దాండకమ్" అనేది ద్రావిడ సాహిత్యంలో ఒక విధమైన ప్రబంధం, ఇది, 6 గణాలను కలిగిన, తాను కోరిన నాయకుడైన భగవంతుని కీర్తించి పొగడే ప్రబంధం. కుఱుందాండగంలో ఒక్కొక్క హల్లుతో కూడి 15 అక్షరాలకు తగ్గకుండా, 26 అక్షరాలకు మించకుండా ఉండాలి –అనేది నియమం. ఆళ్వారుల రెండవ ప్రబంధమైన ఇందులో– భగవంతుని అనుభవించ గోరిన ఆళ్వారుల ఆశ అతిశయించగా, ఆళ్వారులకు భగవంతుడు తన దర్శనాన్ని అనుగ్రహించనందున, వారికి కలిగిన ఆర్తి ఎక్కువ అయినది. దాహం ఎక్కువగా ఉండేవాడు తన శరీరంలోనూ, ముఖంలోను నీటిని జల్లుకొని ఊరటను పొందేటట్లే, ఆళ్వారులు భగవంతుని మూడు కరణాలతోనూ అనుభవించి ఆనందించారు. ఈ మాధుర్యం దివ్యదేశాలను అనుభవించడంవల్ల వచ్చింది– అని, వీటిని అనుభవించగలిగిన వారు భాగ్యచాలురు– అని అళ్వార్లు కీర్తిస్తారు.

"ఆఱైందు" అంటే– 8 గణాలను కలిగి ప్రతిపాదంలోనూ 26 అక్షరాలకు తగ్గకుండా ఉండే 30 పాశురాల మూలంగా ఇష్టదేవతను కీర్తించి పాడడం తిరునెడుందాండకమ్– అనే ప్రబంధం అవుతుంది. ఆళ్వార్లు అనుగ్రహించిన చివరిది అయిన ఈ ప్రబంధంలో, భగవంతుడు వారికి తన నిర్హేతుక కృపతో చేతనా చేతనాలు, ఈశ్వరుడనే తత్వ త్రయాన్ని దర్శింపచేయగా, వాటిని అనుభవించి, ఆ ఆనందం తమలోపల ఇముడనందున తడబడి, గొంతెత్తి పాడారు. తరువాత, నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ళ్ళి* ప్రబంధాన్ని పాడి, మోక్షాన్ని పొందినట్లుగా, వీరు కూడా తిరు నెడుందాండకమ్ అనే ఈ ప్రబంధాన్ని పాడి, పునరావృత్తి లేని మోక్షాన్ని పొంది, తాము మనోరథ పూర్తిని పొందిన రీతిని తెలుపుతూ ప్రబంధాన్ని ముగించారు. ఈ ప్రబంధంలో మొదటి పది పాశురాలను అళ్వార్లు తమ స్వరంతోను, తరువాత పది పాశురాలను తల్లి పాశురాలుగాను, తరువాత పది పాశురాలు నాయకి వచనాలుగాను పాడారని అంటారు. అంతేకాక, మొదటి పదిపాశురాలతో తిరుమంత్రంలోని అర్థం, తరువాత పది పాశురాలతో ద్వయమంత్రంలోని అర్థం, చివరి పది పాశురాలతో చరమ శ్లోకంలోని అర్థం చెప్పబడినవి– అని కూరేశుల కుమారులైన శ్రీ పరాశరభట్టర్ పలికిన సూక్తిని వారి శిష్యులైన పరకాల నల్లాన్ అనే ఆచార్యులు గ్రంథస్థం చేయడాన్ని గమనించవచ్చు.

**(ఇలఙ్గె*ళ్ళు*కూ*ఱ్ఱి*రుక్కై ఇరుమడలిందాన్ వా*ళ్ళి*యే)** తిరువె*ళ్ళు* కూ*ఱ్ఱి*రుక్కై అనేది ఆళ్వార్లు అనుగ్రహించిన మూడవ ప్రబంధం. "ఇలంగుగై"–ప్రకాశించడం –అని అర్థం. ఇక్కడ ఈ ప్రబంధానికి ప్రకాశం ఏమంటే, తిరుక్కుఱుందదాండగమ్ అనే ప్రబంధంలో కలిగిన అనుభవం అళ్వార్లకు ఇంకా ఇంకా ఆర్తిని కలుగజేయగా, ఈ ప్రబంధం ద్వారా కుంభకోణక్షేత్రంలో ఉండే ఆరావముదా*ళ్ళ*వార్ సన్నిధిలో ఆర్తితో శరణు పొందినందున, ఆ ప్రబంధం రథబంధ ప్రక్రియలో అనుగ్రహింపబడడం వల్ల కలిగిన ప్రకాశం. అందువల్ల, ఈ విధంగా, కవిత్వ, విస్తారకవిత్వ, మధురకవిత్వ, చిత్రకవిత్వాలు –అనే నాలుగు రీతులలో ఉండే కవిత్వాలను రచించడంలో సమర్థులైన ఈ ఆళ్వారులు ఈ ప్రబంధాన్ని చిత్రకవిత్వ ప్రక్రియలో రచించారు.

"ఇరు మడల్" –శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే రెండు ప్రబంధాలు. . మడల్ ను ఎత్తడం అంటే– తాను భుజించకుండా, స్నానం చేయకుండా, తాను కోరిన కన్యను ఒక చిత్రపటంలో లిఖించి, దానిని తీసికొని ఊరంతా తిరగడం, తాను కోరిన కన్యను తాను వివాహం చేసుకోవడానికి ఆమె తల్లిదండ్రులు, పెద్దలు అడ్డు వస్తున్నారని, తమ ప్రేమను సఫలం అయ్యేటట్లు చూడమని ఊరిలో ఉండే పెద్దలను ప్రార్థించడం, ఆ విధంగా తమ ప్రేమ ఫలించడం సాధ్యం కాకపోతే చివరికి మరణించడానికి కూడా సిద్ధపడడం– అనే ప్రక్రియను వర్ణించే ఒక ద్రావిడ సాహిత్య పకారం. . ఆళ్వారులు శరణు పొందిన తరువాత కూడా, ఆ ఆళ్వారులద్వారా ఇంకా మరి కొన్ని దివ్యప్రబంధాలు వ్యక్తం అయ్యేటట్లు చూడాలని కోరిన భగవంతుడు, వారికి తన దర్శనాన్ని అనుగ్రహించకుండా ఉన్నాడు. అందువల్ల కోపాన్ని, రోషాన్ని పొందిన ఆళ్వారులు? " భగవంతుని పరత్వాన్ని, అవతారాలలో ఉండే సౌలభ్యాన్ని నేను లోకంలో లేకుండా చేస్తాను" అని ప్రణయ రోషంతో శిఱియ తిరుమడల్ ప్రబంధంలో మడల్ ఎత్తడం ఆరంభించారు. అప్పటికి కూడా భగవంతుడు తన దర్శనాన్ని అనుగ్రహించనందున, ఆ స్వామికి, తమకు నిధి అనదగిన, దివ్యాలయాలలో ప్రకాశించే సౌలభ్యాన్ని కూడా లేకుండా చేస్తాను– అని పెరియ తిరుమడల్ ప్రబంధంలో అన్నారు. శిఱియ తిరుమడల్ ప్రబంధంలో మడల్ ఎత్తడానికి కారణం విభవావతారమైన శ్రీకృష్ణుని కుంభనృత్యాన్ని పరకాల నాయకి దర్శించిన లీలలో మిక్కిలి అభినివేశాన్ని పొందడం. ఈ ప్రబంధంలో ఆళ్వారులు 19 దివ్య దేశాల విషయంలో మంగళా శాసనం చేశారు. పెరియ తిరుమడల్ ప్రబంధంలో మడల్ ఎత్తడానికి తిరునఱైయూర్ దివ్యదేశంలోని దివ్య దంపతులను సేవించలేనందు వల్ల కలిగిన ఆర్తియే కారణం. ఇందులో 16 దివ్యదేశాలకు ఆళ్వారులు మంగళా శాసనం చేశారు.

**(ఇమ్మూన్ఱిల్ ఇరునూ*ఱ్ఱి*రుత్తేళ్లన్దాన్ వాళ్ళియే)** తిరువెళుకూ *ఱ్ఱి*రుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ అనే ఈ మూడు ప్రబంధాలలో మొత్తం 227 పాశురాలు

ఉన్నాయి. తిరువెழு కూற்றிరుక్కై ఒకటే పాశురం. శిఱియతిరుమడల్ 771/2 పాశురాలు. పెరిగయ తిరుమడల్ లో 1481|2పాశురాలు. ఈ విధంగా మొత్తం 227 పాశురాలు ఈ మూడు ప్రబంధాలలో ఉన్నాయి. ఈ మూడు ప్రబంధాలు కూడా మూడవ ఆయిరం అయిన ఇయఱ్పాలో చేరినవి. మడల్ ప్రబంధాలు రెండు కలివెణ్బా అనే ఛందస్సులో రచింపబడ్డాయి.

**(వలమ్ తిగழுమ్ కుమదవల్లి మణవాళన్ వాழிయే)** పరకాలురకు విశేషమైన జ్ఞానాన్ని కలిగించాలని భగవంతుడు భావించి, పరమపదంలో తనకు చామరాన్ని వీచి సేవించే దివ్యకాంతలలో చేరిన ఒక కాంతను ఈ భూమిలో అవతరించమని నియమించాడు. తిరువెళ్ళ క్కుళమ్ అనే దివ్యదేశంలో ఉండే ఒక సరస్సులోని తామర పువ్వులో ఆమె జన్మ సంభవించింది. తిరువాలి ప్రాంతంలో ఉండే ఒక తామర సరస్సులో కొంతమంది అప్సరసలు వచ్చి, ప్రతి దినం జలక్రీడ చేసేవారు. వారిలో తిరుమామళ్ అనే పేరు కలిగిన అప్సరస ఒకతె కుముదపుష్పం కోయడానికి ప్రయత్నించగా, ఇంతలో ఆమెను ఆమె స్నేహితురాండ్రు విడిచి వెళ్లిపోయారు. అపుడు ఈమె మానవ రూపాన్ని ధరించి, ఒంటరిగా నిలిచింది, ఆ సమయంలో, తిరునాంగూర్ దివ్యదేశంలో భగవంతుని సేవించే ఒక వైద్యుడైన భాగవతోత్తముడు ఆ సరస్సులో అనుష్ఠానం చేసుకోవడం కోసం అక్కడికి వచ్చాడు. ఒంటరిగా ఉండే అప్సరస స్త్రీను చూసి, "ఆమె ఎవరు? ఆమె ఒంటరిగా ఉండడానికి ఏమి కారణం? "అని మొదలైన విషయాలను అడిగాడు. ఆమె కూడా తనతో వచ్చిన అప్సరస స్త్రీలు తనను విడిచి వెళ్లిపోయిన సంగతిని తెలియజేసింది. శ్రీమన్నారాయణుని అంశతో పుట్టిన కపిలాచార్యుని శాపంతో మానవ వేషాన్ని ధరించి స్త్రీ అయిన నేను మళ్ళీ స్వర్గలోకానికి వెళ్లలే ఇక్కడే ఉండిపోయాను— అని ఆమె తెలియజేసింది. ఆ వైద్యుడు కూడా ఆ శాపవృత్తాంతాన్ని గూర్చి ప్రశ్నించగా, ఆమె ఈ విధంగా బదులు చెప్పింది.

"నేను సుమంగళి అనే పేరు కలిగినదాన అప్సరసను. నా చెలికత్తెలతో కలసి తిరిగుతూ, నేను ఒకనాడు హిమాలయ పర్వతంలో ఉండే వైభవాలను అన్నిటినీ చూస్తూ వచ్చే సమయంలో, ఒక సిద్ధాశ్రమంలో కపిలాచార్యులు మహర్షులకు భగవద్వైభవాన్ని చెప్పేటపుడు, నేను అందులో ఒక కురూపి అయిన సిద్ధపురుషుని చూసి పరిహాసం చేశాను. కపిల మహర్షి అప్పుడు కోపించి, " నీవు మానవ రూపాన్ని పొంది, ఒక తక్కువ కులంలో పుట్టినవానికి భార్య అవుతావు" అని శపించారు. నేను చాలా బాధపడి ప్రార్థించగా, ఆ మహర్షి కూడా " ఓ కన్యా! లోకరక్షణ కోసం శార్ జ్ఞమనే విల్లు అంశతో పరకాలుడు అవతరించబోతాడు. అతడు రాజ్యాధికారి కాగలడు. అతనికి భార్యవై, అతనిని నీవు భాగవతోత్తముని చేస్తే నీ శాపం తీరిపోతుంది" అని చెప్పాడు. అందువల్ల నేను ఈ విధంగా ఇక్కడకు వచ్చాను" అని ఈ విధంగా ఆ అప్సరస వైద్యునకు సమాధానం చెప్పింది. ఆ వైద్యుడు కూడా, తనకు సంతానం లేనందున ఆమెను తన ఊరుకు తీసుకుని పోయి, ఆమెను రక్షించాడు. కుముదపుష్పాన్ని కోయడమే చిహ్నంగా కలిగినది కనుక, ఆమెకు కుముదవల్లి త్తాయారు అనే పేరునుపెట్టి, రక్షించాడు. . ఇది కుముదవల్లి వృత్తాంతం.

"వలమ్ తికழ்మ్"– వలం అంటే –బలం. ఇక్కడ బలం ఏమంటే, పరకాలురను భాగవతోత్తమునిగా చేసిన బలం. అంటే, శంఖం, చక్రం, తిరుమణ్ కాప్పు, దాస్యనామం, మంత్రోపదేశం, తిరువారాధనం–అనే ఐదు సంస్కారాలతో పవిత్రతను పొందిన శ్రీవైష్ణవునిగా చేసి, తన భర్తగా చేసి కొన్న బలం. అంతేకాక, ప్రతిదినం వెయ్యి ఎనిమిదిమంది శ్రీవైష్ణవులకు తాంబూలంతో దక్షిణ ఇచ్చి, షడ్రసోపేతమైన భోజనాన్ని పెట్టాలని కూడా ఆమె నియమం పెట్టింది. మొదట తిరునఱైయూర్ క్షేత్రానికి వెళ్ళి, అక్కడ ఉండే భగవంతుడైన నంబివల్ల పంచ సంస్కారాలను ఆళ్వార్లు పొందారు. ప్రతిదినం భాగవతులు వెయ్యి మందికి తదీయారాధన చేసి, కుమువల్లి మాటను నెరవేర్చినవారు అయినందున "వలమ్ తికழ் కుముదవల్లి "అని చెప్పబడింది.

**(కుముదవల్లి మణవాళన్)** "మణమ్" అంటే—< ద్రావిడంలో వివాహం, దానిని పాలించేవాడు, అంటే, పొందినవాడు— అని అర్థం. అంటే, వరుడు —అని అర్థం. కుముదవల్లి పెట్టిన నియమాన్ని నెరవేరుస్తానని స్థిరమైన మాటను చెప్పగా, ఆ వైద్యుడు కూడా తన కుమార్తె అయిన కుముదవల్లిని, పలు సంపదలో నిండిన ఆళ్వార్లకు ఉదకజలధారా పూర్వకంగా వివాహం చేసి ఇచ్చాడు. అందువల్ల "కుముదవల్లి మణవాళన్" అని అనబడింది.

**(వాట్కలియన్ పరకాలన్ మంగైయర్ కోన్ వాழியే)**

(వాట్ కలియన్) చేతిలో స్థిరంగా ఉండే ఖడ్గాన్ని కలవారు, శత్రువులను నశింపజేసే స్వభావాన్ని కలిగిన ఖడ్గాన్ని కలవారు— అని అర్థం. కుముదవల్లి నియమనం పేరుతో ప్రతిదినం ధనికులను కొల్లగొట్టి, 10008 మంది భాగవతులకు తదియారాధన చేస్తూ వచ్చారు, ఆళ్వారులు, ఒకనాడు, భగవంతుడు తన దివ్యపత్నితో పాటు నూతన వధూవరుల వేషంలో బ్రాహ్మణుని వేషాన్ని ధరించి, విశేషమైన ఆభరణాలను ధరించి వచ్చాడు. అప్పుడు ఆళ్వారులు వారిని అడ్డుకొని, నిర్బంధించి, వారి వస్త్రాలను ఆభరణాలను అన్నిటిని కొల్లగొట్టగా, ఆ వరుడు తన కాలివేలిలో అలంకరించుకున్న ఉంగరాన్ని తొలగించటానికి అళ్వార్లకు వీలు కాలేదు. దానిని కూడా విడవకుండా తన పళ్ళతో బలంగా కరిచి, తొలగించడానికి వారు ప్రయత్నించారు. ఆ బలాన్ని చూసిన బ్రాహ్మణ రూపంలో వచ్చిన భగవంతుడు" కలియనే! "అని అళ్వార్లను సంబోధించాడు. ఇందువల్ల ఆళ్వారులకు "కలియన్" అంటే, బలం కలవారు అనే విలక్షణమైన నామం కలిగింది. అంతేకా, ఆ బ్రాహ్మణువరుని దగ్గర నుండి కొల్లగొట్టిన సంపద పర్వతంవలె కదల్చడానికి వీలు లేకుండాపెద్దదిగా ఉన్నందున, ఆళ్వారులు కోపాన్ని పొందినవారై, ఆ బ్రాహ్మణుని రూపంలో వచ్చిన భగవంతునకు కత్తిని చూపించి, భయపెట్టారు. అపుడు, ఆ బ్రాహ్మణ రూపంలోని భగవంతుడు ఆళ్వారులకు అష్టాక్షరీ మహామంత్రోపదేశాన్ని చేశాడు. అందువల్లనే "వాట్కలియన్" అనే పేరును ఆళ్వార్లు పొందారు. ఈ కారణంగానే వ్యాఖ్యాత పెరియ వాచ్చాన్ పిళ్లై కూడా—"తెన్నరంగన్

తన్నై వళ్ళి పఱిత్త వాళన్" (శ్రీరంగనాథుని దారి దోపిడీ చేసిన, ఖడ్గాన్ని ఆయుధంగా కలవాడు) అని అన్నారు, పిళ్లై ఉఱంగా విల్లి దాసర్. దానిని నిరూపించే రీతిలో అళ్వార్లు "వాడినేన్ వాడి నాన్ కండుకొండేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్" (నేను నారాయణ నామాన్ని కనుగొన్నాను) అని అన్నారు. " మంగైయార్ వాట్కలి కన్టి" అని అళ్వార్లు పల్కినదానికి తగినట్లు, భగవత్సంబంధాన్ని తెలిసినవారు, భగవత్సంబంధమే బలంగా కలిగిఉండేటట్లు, తిరుమంగైనగరంలో ఉండేవారు ఆళ్వార్ల చేతిలో ఖడ్గాన్నే తమకు బలంగా భావిస్తారు" అని వ్యాఖ్యానించారు.

ఈ ఆళ్వార్లను మణవాళ మహాామునులు "నఱ్కలియన్" అని కీర్తించారు. దీని భావం ఏమంటే –భగవంతునకు మిక్కిలి ప్రియులైన భాగవతులకు దాస్యం అనే స్వభావంలో స్థిరంగా నిలచినవారై, మిగిలిన ఆళ్వారుల శ్రీచరణాలలో సేవయే తమకు నిరూపకం– అని భావించే గొప్పతనాన్ని కలిగినవారై, భగవంతుని దగ్గర ఉండే కాలి ఉంగరం మొదలుకొని అన్నిటిని కొల్లగొట్టినవారు కనుక, "కలియన్" అనే పేరుతో నిరూపింపబడేవారై, ఇటువంటి నిరూపకం ఇంకొకరికి ఎవరికీ లేని రీతిలోని గొప్పతనాన్ని కలిగినవారు– అని భావం.

"పరకాలన్ "–తనను ఎదిరించిన శత్రువులను వారు తల ఎత్తకుండా చేసేవారు. శత్రువులకు తన దగ్గరకు రావడానికి వీలు లేని రీతిలో, సింహంవలె, తమను జయించడానికి సాధ్యం కాకుండా ఉండేవారు. ఆయుధవిద్యలో పరిపూర్ణతను పొంది, చోళప్రభువు వద్ద సేనాధిపతిగా పదవిని పొంది, పలువురను జయించి, పరకాలురు– శత్రువులకు యమునివంటివారు– అనే కీర్తిని పొందినవారు.

భట్టర్ అనుగ్రహించిన సంస్కృత తనియన్ శ్లోకంలో పరకాల శబ్దానికి తగినట్లు, భగవంతునకు శత్రువులైన, వేదాన్ని కాదనేవారిని బాహుబలంతో నశింపజేసి, అంతకుమించి, శాస్త్రమూలంగా జయించాలని వచ్చిన శత్రువులను తమ

వాగ్బలంతోను, ఆయుధంతోను నశింపచేసి, శ్రీరంగనగరంలో మణిమండపాలను కట్టిన కైంకర్యాలను, " అరంగమాలై శొల్లినేన్ తొల్లై నామమ్" (శ్రీరంగంలో ఉండే సర్వాధికుని నామాన్ని చెప్పాను) అనే విధంగా వాచిక కైంకర్యాలను చేసినవారు అయినందున పరకాలురు– అని కూడా అర్థం.

(మంగైయర్ కోన్) ఇటువంటి వీర్యాన్ని గౌరవించిన ప్రభువు ఈ అళ్వార్లను తిరుమంగై ప్రాంతానికి ప్రభువుగా చేసి, తనకు సామంత రాజుగా పట్టాభిషేకం చేసినందున "మంగైయర్ కోన్" అయ్యారు. " పెరుమ్ పుకழ் మంగైయర్ కోన్" అని ఎంబార్ అనుగ్రహించినదానికి తగినట్లుగా, మిక్కిలి గొప్ప కీర్తిని గలిగిన తిరుమంగై నగరానికి ప్రభువులు ఆళ్వారులు –అని అంటారు. శ్రీవరవరమునులు ఉపదేశ రత్నమాలై ప్రబంధంలో " మాఱన్ పణిత్త తమిழ் మఱైక్కు మంగైయర్ కోన్ ఆఱంగమ్ కూఱ అవతరిత్త" (నమ్మాళ్వారులు అనుగ్రహించిన నాలుగు వేదాలు అనదగిన నాలుగు ద్రావిడ ప్రబంధాలకు అంగాలుగా ఆరు ప్రబంధాలను అనుగ్రహించడం కోసం అవతరించినవారు) అని అంటారు. దీనినిబట్టే, "ఇరుమ్ తమిழ் నూఱ్పులవర్ మంగైయర్ కోన్ " అనే మాటకు తగినట్లుగా, ఎవరికీ అంతు చూడడానికి సాధ్యం కానట్లుగా ఉండే వైభవాన్ని కలిగిన ద్రావిడ పాశురమాలికలనే శాస్త్రంలో పారంగతమైన జ్ఞానాధిక్యాన్ని కలవారు, తిరుమంగై అళ్వార్–అని ఆచార్యహృదయ వ్యాఖ్యానంలో శ్రీ వరవరమునులు అనుగ్రహించారు. అంతేకాక శ్రీవరవరమునులు ఉపదేశరత్నమాలై ప్రబంధంలో "వాయ్ త్త పుకழ் మంగైయర్ కోన్" (గొప్ప కీర్తిని కలిగిన తిరుమంగై ఆళ్వార్) అనే సూక్తికి తగినట్లుగా వీరికి కీర్తికి గొప్పతనం ఏమంటే, భగవంతుని దగ్గరనుండి పొందిన తిరుమంత్రలాభమే కదా.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన తిరుమంగై ఆళ్వార్ శ్రీచరణాలకు మంగళాశాసనం చేసి, ఉజ్జీవిద్దాం. రండి.




మలయప్ప స్వామి, తిరుమల

## శ్రీవేంకటాచలేతిహాసమాల—శ్రీవేంకటేశ్వరతత్త్వం

ఏ విషయాన్ని అయినా ప్రామాణికంగా నిర్ధారణ చేయడానికి ఆధారాలు మూడు ఉంటాయి. అవి ఏవి? అంటే, సాహిత్యపరమైన ఆధారాలు, చారిత్రక అవశేషాలు, శిలాశాసనాలు-అనేవి. తిరుమలలో నెలకొని ఉన్న శ్రీవేంకటేశ్వరుని తత్వాన్ని నిరూపించే ప్రామాణికమైన సాహిత్యాధారాలలో శ్రీవేంకటాచలేతిహాసమాల ఒకటి. దీనిని అనంతార్యులు రచించారు. వీరు శ్రీరామానుజుల ముఖ్య శిష్యులలో ఒకరు. శ్రీ వేంకటాచలేతిహాసమాలలో మనకు లభించే ఆధారాలు అన్నీ సుమారు క్రీ. శ. 1050—1150 సంవత్సరాల మధ్య కాలానికి సంబంధించినవి. ఈ కాలంలో తిరుమల క్షేత్రానికి సంబంధించిన పలు విశేషాలను ఈ గ్రంథం తెలుపుతున్నది. శ్రీవేంకటాచలేతిహాసమాలలో ఏడు భాగాలు ఉన్నాయి. వీటికి స్తబకాలని పేరు. శ్రీరామానుజుల ఆజ్ఞను అనుసరించి తిరుమలకు వచ్చి అక్కడ శ్రీ వేంకటేశ్వరునకు పుష్పమాలికాసమర్పణ సేవను చేసికొన్న ధన్యులు అనంతాచార్యులు. ఈ సేవ కోసం వీరు తిరుమలలో దక్షిణ మాడ వీధి నైరుతి మూలలో ఒక ఉద్యానవనాన్ని, దానిని పెంచడం కోసం ఒక చెరువును నిర్మించారు. వీనిని ఈనాడు కూడా దర్శించవచ్చు.

అనంతార్యులు శ్రీవేంకటాచలేతిహాసమాలను రచించడానికి దోహదం చేసిన చారిత్రక నేపథ్యాన్ని కూడా ప్రస్తుతం స్మరించుకోవాలి. శ్రీ రామానుజులు శ్రీరంగాన్ని ఆధ్యాత్మిక కేంద్రంగా చేసుకొని విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచార నిర్వహణను చేస్తున్న సమయంలో, తిరుమల ప్రాంతాన్ని యాదవరాజు పరిపాలించేవాడు. ఆ సమయంలో తిరుమల కొండ మీద ఉండే వేంకటేశ్వరుని విగ్రహతత్వం విషయంలో వివాదం ఏర్పడింది. శైవులు కొంతమంది కొండ మీద ఉండే విగ్రహరూపం కుమార స్వామి రూపం కానీ, శివుని రూపం కానీ కావచ్చునని, వైష్ణవులు దానిని విష్ణు స్వరూపంగా మార్చి ప్రచారం చేస్తున్నారని ఆరోపించి, యాదవ రాజు దగ్గరకు వచ్చి న్యాయాన్ని చేయమని అర్థించారు. యాదవరాజు అప్పుడు ఈ విషయంలో శైవులు చేసే వాదనలకు సరైన సమాధానాన్ని చెప్పగలిగినవారు శ్రీరామానుజులే అని భావించి, వారిని తిరుపతికి

ఆహ్వానించాడు. ఆ సమయంలో శైవులకు, రామానుజులకు మధ్య జరిగిన వాదంలో, శ్రీ రామానుజులు శైవులు చేసే వాదాలకు అన్నిటికి తగిన యుక్తి సహమైన, ప్రమాణ సహమైన సమాధానాలను పలికి, కొండ మీద ఉండే విగ్రహతత్వం విష్ణుస్వరూపమే కాని, కుమారస్వామి రూపం గాని శివుని రూపం కాని కాదని నిర్ధారణ చేశారు. ఈ విధంగా జరిగిన వాదంలోని విశేషాలను అనంతార్యులు వేంకటాచలేతిహాసమాలలో మొదటి మూడు స్తబకాలలో ప్రస్తావన చేశారు. ఈ వివరాలను ఆధారంగా చేసుకొని శ్రీవేంకటాచలేతిహాసమాల ప్రకారం వేంకటేశ్వరతత్వాన్ని మనం గమనించవచ్చు. వాటిలో కొన్ని వివరాలు ఈ వ్యాసంలో ప్రస్తావింపబడుతున్నాయి.

1)తారకాసుర సంహారం వల్ల ఏర్పడిన దోషాన్ని తీర్చుకోవడం కోసం కుమారస్వామి శివుని ఆజ్ఞను అనుసరించి వేంకటాచలం పైకి వచ్చి, అక్కడ పుష్కరిణికి దక్షిణ తీరంలో నిలచి తపస్సు చేస్తున్నాడని, అందువల్లనే కొండ మీద ఉండే కోనేరుకు 'స్వామి పుష్కరిణి' అనే పేరు వచ్చిందని శైవులు చేసే ఒక వాదన. ఇందుకు వారు వామన పురాణంలోని "మామాపి తపసో యోగ్యం క్షేత్రం బ్రూహి శుభాన్వితమ్----- జగామ శిఖినా తస్మాత్ కుమారో వృషభాచలమ్" ఇత్యాదిగా కొన్ని వాక్యాలను ఉదాహరించారు. భిమసేన శబ్దంలో భిమశబ్దం, సత్యభామశబ్దంలో సత్యశబ్దం వ్యవహారంలో ఉండేటట్లు, కుమారస్వామి శబ్దంలో స్వామిశబ్దం ఇక్కడ కోనేరునామంలో వచ్చి, స్వామి పుష్కరిణి అనే పేరు కలిగింది అని, తిరుమల క్షేత్రం అందువల్ల శివ క్షేత్రమే తప్ప విష్ణుక్షేత్రం కాదని వారు వాదించారు.

శ్రీ రామానుజులు ఈ వాదానికి సమాధానం పలుకుతూ, తిరుమలపై ఉండే కోనేరుకు 'స్వామి పుష్కరిణి' అనే పేరు కలగడానికి గల కారణాన్ని వామన పురాణంలోని "అస్తి వేంకటాచలో నామ ప్రార్థితః పురుషోత్తమః, ------స్వామిపుష్కరిణీ నామ సరసీ సర్వకామదా, త్రైలోక్యవర్తినాం బ్రహ్మన్ తీర్థానాం స్వామినీ హి సా, స్వామిపుష్కరిణీత్యేతత్ నామధేయం చ తత్ కృతమ్" ఇత్యాది కొన్ని ప్రమాణాలను

ఉట్టంకించారు. అన్ని పుష్కరాలలో ఇది 'స్వామిని' వంటిది కనుక దీనికి ఈ పేరు వచ్చిందని పై ప్రమాణంలోని తాత్పర్యం. ఈ సందర్భంలో రామానుజులు ఇంకా వరాహపురాణం, స్కాంద పురాణం మొదలైన పలు పురాణాల నుండి వాక్యాలను ప్రమాణీకరించారు. దీనినిబట్టి కొండమీద కోనేరుకు దక్షిణ తీరంలో ఉండే మూర్తి కుమారస్వామియే అని చెప్పే అవకాశం లేదని వారు నిరూపించారు. ఇక తిరుమల క్షేత్రం విష్ణు క్షేత్రమే అనే విషయానికి పలు ప్రమాణాలను వరాహ, బ్రహ్మాండ, వామనాది పలు పురాణాలనుండి ప్రస్తావించడంతోపాటు, ఋగ్వేదంలోని "అరాయి కాణే" ఇత్యాది ఒక సూక్తాన్ని కూడా శ్రీరామానుజులు ప్రస్తావించారు.

ఈ సూక్తం ఋగ్వేదంలోని ఎనిమిదవ అష్టకంలో ఎనిమిదవ అధ్యాయంలోని పదమూడవ వర్గలో ఉన్నది. "అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే, శిరింబిఠస్య సత్త్వభిః తేభి ష్ట్వా చాతయామసి" అనేది ఆ సూక్తం. ఇందులో వేదపురుషుడు ఐహిక ఆముష్మిక సంపద లేని మానవుని చూచి ఉపదేశిస్తూ, "తాపత్రయాలతో బాధపడే నీవు భగవద్భక్తులతో కలసి శ్రీనివాసుని నివాసమైన తిరుమలకు వెళ్ళి, అక్కడ నిన్ను ఆ స్వామికి సమర్పించుకొని ప్రార్థించు. నీ అభీష్టం సిద్ధిస్తుంది" అని ఉపదేశిస్తున్నాడు. ఈ సూక్తంలో ముఖ్యంగా గమనించవలసినది "శిరింబిఠస్య" అనే పదం. ఇది "శ్రీపీఠస్య" అనే పదానికి ఛాందసరూపం. "శ్రీనివాసుని యొక్క" అని దీని అర్థం. దీనిని బట్టి వేంకటాచలక్షేత్రం విష్ణుక్షేత్రమే తప్ప శివక్షేత్రం కాదని తెలుస్తున్నది-అని శ్రీరామానుజులు నిరూపించారు. ఈ సూక్తం వేంకటాచల క్షేత్రానికి సంబంధించినది అనే విషయాన్ని భవిష్యోత్తర పురాణంలోని "అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః, ఏవం వేదమయః సాక్షాత్ గిరీంద్రః పన్నగాచలః" అనే శ్లోకం నిరూపిస్తున్నది అని కూడా తెలియజేశారు.

2) తిరుమలలో ఉండే మూర్తి జటలను కలిగి ఉన్నది కనుక, ఈ విధంగా జటలను కలిగి ఉండడం సాధకవేషానికి గుర్తు కనుక, ఈ మూర్తి తపస్సు చేసే కుమారస్వామి రూపమే తప్ప విష్ణురూపం కాదని శైవులు చేసిన ఇంకొక వాదం.

దీనికి సమాధానంగా శ్రీరామానుజులు, పాంచరాత్రంలోని సాత్వతసంహిత నుండి, భాగవతం మొదలైన గ్రంథాలనుండి ప్రమాణాలను ఉదహరించి, ఈ విధంగా జటలను విష్ణు స్వరూపం కలిగి ఉండే విషయాన్ని నిరూపించారు. పద్మావతీ పరిణయగాథలో వేట ఆడే శ్రీనివాసుని రూపాన్ని వర్ణించే సందర్భంలోని "సితోష్ణీషలలాటం చ నాతిదీర్ఘజటాధరమ్" అనే ప్రమాణాన్ని చూపించి ఆ స్వామి జటాధరుడు అనే విషయాన్ని తెలిపారు.

3) వేంకటాచలంలో ఉండే విగ్రహంలో నాగాభరణాలు ఉన్నాయి కనుక అది విష్ణురూపం కాదని శైవుల మరొక వాదన.

దీనినికూడా శ్రీరామానుజులు పద్మపురాణం, భవిష్యోత్తరం మొదలైన పురాణాల నుండి ఆధారాలను చూపి, శ్రీవేంకటేశ్వరుని రూపంలో నాగాభరణాలు ఉండడం సహజమని తెలియజేసి, శైవుల వాదనను నిరాకరించారు. పద్మపురాణంలో పద్మసరోవరతీరంలో శ్రీనివాస భగవానుని ఆవిర్భావాన్ని వర్ణించే ఘట్టంలోని "శంఖచక్రగదాంభోజ- రాజత్ కరచతుష్టయః, నాగైరబినవాకల్పైః తాపనీయమయాంశుకైః" అనే ప్రమాణాన్ని, భవిష్యోత్తరంలోని శ్రీనివాస పద్మావతీ కళ్యాణసందర్భంలో ఆకాశరాజు శ్రీనివాసునకు నాగాభరణాలను కానుకగా ఇచ్చిన విషయాన్ని తెలిపే "నాగాభరణయుగ్మం చ బాహుపూరాదికాం స్తథా" అనే వచనాన్ని రామానుజులు ఉదాహరించారు.

4) కొండ మీద ఉండే రూపంలో చేతులలో శంఖచక్రాలు లేకపోవడంకూడా ఆ మూర్తి విష్ణుస్వరూపం కాదని నిరూపిస్తున్నది అని శైవుల వేరొక వాదన.

ఈ వాదనను శ్రీరామానుజులు బ్రహ్మాండ పురాణంలోని తొండమాన్ చక్రవర్తి వృత్తాంతాన్ని ఉదాహరించి శైవుల వాదాన్ని నిరాకరించారు. తొండమాన్ చక్రవర్తి వేంకటేశ్వరస్వామి భక్తుడు. అతడు ఒక పర్యాయం తన శత్రువులతో యుద్ధం చేయవలసి వచ్చింది. అతని శత్రువులు బలవంతులు కనుక వారిని జయించడ కోసం శ్రీవేంటేశ్వరస్వామిని ప్రార్థించి ఆస్వామి దగ్గర నుండి శంఖచక్రాలను సహాయంగా పొందాడు. యుద్ధంలో జయించిన తరువాత కూడా తనకు ఆ స్వామి సహాయం చేసినదానికి గుర్తుగా చేతులలో శంఖచక్రాలను ధరించకుండా స్వామి ఉండాలని ప్రార్థించాడు. అతని ప్రార్ధనను మన్నించి వేంకటేశ్వరుడు తన చేతులలో శంఖచక్రాలను ధరించకుండా ఉన్నాడు. అందువల్ల ప్రస్తుతం కొండమీద స్వామిరూపంలో శంఖచక్రాలు లేవు—అని రామానుజులు పలుకుతూ, "దర్శయన్ భక్తవాత్సల్యం యో దదౌ హస్తగే శుభే, . శంఖచక్రే నృపేంద్రాయ చక్రవర్తీతి యం విదుః, అత ఏవారిశంఖాభ్యాం దృశ్యేతే రహితౌ కరౌ" అనే భవిష్యోత్తర పురాణ వచనాలను ఉదాహరించారు.

ఇంతే కాక, కొండ మీద ఉండే విగ్రహంలో సహజంగా శంఖచక్రాలు ఉన్నాయి అనే విషయానికి ప్రమాణంగా రామానుజులు శఠకోపసూరి రచించిన సహస్రగాథలోని ఒక పాశురాన్ని కూడా ప్రమాణీకరించారు. శఠకోపసూరి సహస్రగాథా ప్రబంధంలో(తిరువాయ్ మొళి) కొండ మీద ఉండే భగవంతుని రూపాన్ని వర్ణిస్తూ(6—10—2) "కూరాయ్ నీఱాయ్ నిలనాకి కొడు వల్లశురర్ కులమెల్లామ్ శీరా వెరియుమ్ తిరునేమి వలవా!" (క్రూరులైన అసురుల సమూహాన్ని ఖండించి, భస్మం చేసే సుదర్శనచక్రాన్ని కుడిచేతిలో కలిగిన స్వామీ!) అని సంబోధించారు. దీనిని బట్టి కూడా కొండ మీద ఉండే మూర్తిలో సహజంగా శంఖచక్రాలు ఉన్నాయని తెలుస్తున్నదని రామానుజులు అన్నారు. ఆ సందర్భంలోనే ఇంకొక పాశురంలో కొండ మీద స్వామి వేంచేసి ఉండే

సన్నివేశాన్ని కీర్తిస్తూ శఠకోపసూరి "అడిక్కీళ్ అమర్ న్దు పుకుందు అడియార్ వాళ్ మిన్" (6–10–11) (నా పాదాల చెంత చేరి, ఓ భక్తులారా, తరించండి) అని అనడం కూడా గమనించాలి. ఇది శ్రీనివాసుడు తన చేతితో పాదాలను చూపుతూ "మత్పాదౌ శరణం వ్రజ" అని అనడం సూచిస్తుందని, దీనివల్లకూడా కొండ మీద ఉండే రూపం విష్ణు రూపం అని తెలుస్తున్నది అని రామానుజులు తెలిపారు.

5) కొండమీద మూర్తికి బిల్వపత్రాలతో అర్చన జరుగుతున్నది కనుక, ఆ మూర్తి విష్ణురూపం కాదు అని కూడా శైవుల వాదన.

దీనిని సైతం రామానుజులు చాలా ప్రమాణాలను చూపి సమాధానం చెప్పారు. బిల్వం లక్ష్మి కి చాలా ప్రియమైనది. ఈ విషయం శ్రీసూక్తంలోని "వనస్పతిః తవ వృక్షోథ బిల్వః" ఇత్యా ది సూక్తిని ఉదాహరించడమే కాక, హారీతస్మృతిలో ధనుర్మాసారాధనను వివరించే సందర్భంలోని ఈ క్రింది వాక్యాలను ప్రస్తావించారు. "నారాయణం జగన్నాథ మర్చయేద్విధివత్ పునః, శతపత్రైశ్చ జాతీభిః తులసీబిల్వపుష్కరైః, ------ లక్ష్మీనారాయణం దేవం భార్గవే వాసరే నిశి, అఖండబిల్వపత్రైశ్చ కోమలైః తులసీదళైః, అర్చయేత్ మంత్రరత్నేన వామాంకస్థశ్రియా సహ". ఈ ప్రమాణాలనే కాక, వరాహ పురాణంలోని "అర్చయంతి జగన్నాథం తథా బిల్వదళైరపి" అనే వచనాన్ని కూడా ఉదాహరించారు.

శ్రీ వేంకటాచలేతిహాసమాలలో కనిపించే ఈ వాదవివరాలను గమనించినట్లయితే వేంకటేశ్వరతత్వం 'విష్ణుతత్వమే' అనే విషయం స్ఫుటమవుతుంది.

తరువాత యాదవ రాజు కోరికను అనుసరించి రామానుజులు నూతనంగా శంఖచక్రాలను చేయించి, వాటిని శ్రీవేంకటేశ్వరుని ఆలయం లోపల పెట్టి, వాటిని స్వీకరించవలసిందిగా స్వామిని ప్రార్థించారు. వేంకటేశ్వరుడు వారి ప్రార్థనను అంగీకరించి

యథాపూర్వం తన చేతిలో శంఖ చక్రాలను ధరించాడు. అప్పటినుండి కొండమీద ఉండే మూర్తి శంఖ చక్రాలతో సాక్షాత్కరిస్తున్నది. శ్రీనివాసునకు రామానుజులు శంఖ చక్రాలను ప్రదానం చేసినందున ఆ స్వామికి ఆచార్యులుగా కూడా సంప్రదాయంలో పరిగణింపబడుతున్నారు. రామానుజులు కొండపై పూర్వం, విష్ణువు ఆరాధన ప్రకారాలలో ఒక ప్రకారమైన వైఖానసాగమ ప్రకారం పూజాదులు జరిగినవని తెలిసికొని, దానికి తగిన వ్యవస్థను మళ్లీ పునరుద్ధరించారు. కొండమీద శ్రీవేంకటేశ్వర స్వామికి ముఖంలో అలంకరించే ఊర్ధ్వపుండ్రరూపం ఉండవలసిన రీతినికూడా శాస్త్రానుసారంగా నిర్ణయించారు. ఈనాడు ఉత్సవబేరంగా ఆరాధింపబడుతున్న మలయప్పస్వామి మూర్తిని ఆ విధంగా ప్రతిష్ఠ చేయించినవారు రామానుజులే. కొండపై జరుగవలసిన పూజా వ్యవస్థను శ్రీరామానుజులు పూర్తిగా కట్టుదిట్టం చేశారు. శ్రీవేంకటేశ్వరుని ఆలయంలోని కైంకర్యం అవిచ్ఛిన్నంగా సాగడం కోసం జీయర్ వ్యవస్థను కూడా ఏర్పాటు చేశారు. ఇటువంటి వివరాలన్నీ వేంకటాచలేతిహాసమాలలో కనిపిస్తాయి.